# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా

ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206

web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 28 Issue 10
No.of Pages 40
JUNE 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:

మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

**ఈ సంచికలో....** **పేజీ**

# భద్రవాక్యం

**యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం త  దపాణి పాదమ్।**
**నిత్యంవిభుం సర్వగతంసుసూక్ష్మం తదవ్యయంయద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః॥**

-ముండకోపనిషత్

ఈ శ్లోకం ఆథర్వణ వేదీయ ముండకోపనిషత్ ప్రథమ ఖండంలోని ఆరవమంత్రం.

ధీరులైనవారు దేనిని నిరతరము దర్శిస్తుంటారో అది సకల చరాచర భూతములు ఎందులోనుండి వస్తున్నాయో అట్టి మహద్యోని, కారణము, ఇంద్రియములకు అగోచరము, అగ్రాహ్యాము  అవ్యయము లేదా నాశ రహితమైనది. పుట్టుక, కులగోత్రములు లేని, అవర్ణము, వర్ణములకు అతీతము అయిన ఆ పరబ్రహ్మము కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు లేనిది. అది నిత్యము. సర్వమునకు విభువు, సర్వాధిష్ఠానము. అణువులో అణువుకన్న సూక్ష్మమైనదిగా, సర్వభూతజాలములో అంతర్యామిగా సర్వేసర్వత్రా వ్యాపించి ఉన్నది.

ధీరులు అంటే ఒంటరిగా ఒక సింహమునో లేదా పులినో ధైర్యముగా ఎదిరించి పోరాడి గెలిచే అసహాయశూరులు అని కాదు. లౌకిక వ్యవహారములలో స్వేచ్ఛావిహారం చేసే అంతర్బాహ్యేంద్రియములు అనే మదపుటేనుగులను శమము, దమము అనే అంకుశాలతో స్వాధీనం చేసుకొన్న నియతేంద్రియులు అని అర్థం. పరిపశ్యంతి అంటే కేవలం చూడటంకాదు. ఉన్నదానిని ఉన్నట్లుగా చూడటం. యః లేదా తత్ అంటే అక్షరపరబ్రహ్మమే. అదే సర్వాధిష్ఠానంగా, సర్వాంతర్యామిగా మహత్తును కూడ తనలో ఇముడ్చుకున్న మహత్తు కన్న గొప్పదిగా  అణువుకంటే సూక్ష్మంగా అణువులో ఇమిడి సర్వేసర్వత్రా నిండి వ్యాపించి ఉన్నది. ఆ బ్రహ్మయోనినుండి సకల భూతములు సృష్టిలోనికి రావటం దర్శించినట్లుగా శ్రీ రామకృష్ణులు చెప్పియున్నారు. ఆ మహద్యోని పుట్టుక లేనిది. దానికి వర్ణము లేదు. అన్ని వర్ణాలు దానివే అయి వాటికి అతీతంగా ఉంటుంది. అన్ని కళ్ళు, అన్ని చెవులు, అన్ని కాళ్ళు, అన్ని చేతులు దానివే అయినా దానికి కళ్ళు, చెవులు,కాళ్ళు, చేతులు లేవు. అవేవి లేకపోయినా అది అన్నింటిని దర్శించ గలదు, వినగలదు, అన్ని చోట్లకు వెళ్ళగలదు, అన్ని పనులు చేయగలదు. ఇంద్రియాతీతము, ఇంద్రియములకు అగోచరమైన ఆ అక్షర పరబ్రహ్మము అకర్త, అభోక్త, దేనికీ విషయము కాదు. సాధకులు చేయవలసినదంతా చేసి ఆ అక్షర పరబ్రహ్మమును పొందటానికి ఇంకా ఏమి చేయాలో తెలియక కొట్టుమిట్టాడే సమయంలో ఆ సాధకుణ్ణి కరుణించి అతని స్వస్వరూప అపరోక్షానుభూతిగా అహం ప్రత్యయ గోచరం అయ్యేది ఆ అక్షర పరబ్రహ్మమే*

## అమ్మ ఆశీస్సులు

శ్రీ సద్గురుదేవుల పరిపూర్ణ అనుగ్రహంతో శ్రీగురుపూర్ణిమ మహా వైశాఖి కార్యక్రమములు ఎంతో వైభవముగా జరిగినవి. పూర్ణిమ అంటేనే అంతా నిండి సర్వవ్యాపకమై ఉన్నటువంటిది. ఇక్కడ రోజును బట్టి చూస్తే 15రోజులు శుక్లపక్షము, 15రోజులు కృష్ణ పక్షము, పూర్ణిమ, అమావాశ్యలు కలిగిఉన్నవి. కాని శ్రీ గురుదేవుని అనుగ్రహము పరిపూర్ణము. తత్త్వము పరిపూర్ణము. సాధకునికి శ్రీ సద్గురుదేవుని స్మరణ మాత్రము చేతనే మనస్సు శ్రీ సద్గురు దేవులతో పూర్ణమై ఉంటుంది. అట్టి అనుభూతిలో నేను సాధకుడను అని కాని, మానవుడను అని కాని, భక్తుడను అని కాని, బోధకుడను అని కాని లేనిది. అట్టి పరిపూర్ణ అనుభూతిని శ్రీ గురుదేవులే అనుగ్రహిస్తున్నారు. అదే - **పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా శిష్యతే ॥**

**ఓం శాంతి శ్శాంతిశ్శాంతిః॥**

"అందులోనిదే ఈ జగత్తంతా అయితే మరి నీవేమౌతావు? నువ్వు వెంకయ్యవో, పుల్లయ్యవో అవుతావా?'' నువ్వుకూడా అనంతంలోని వాడవే కదా!'' అనేవారు గురుదేవులు.

ఆశ్రమంలోని పెద్దలందరి ప్రార్థన మేరకు నెలకొకసారి జరిగే మూడురోజుల త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమములు ఈ నెల 10,11,12 తేదీలలో దివ్యంగా జరిగినవి. మా గురుసోదర సోదరీమణులు అందరం శ్రీ సద్గురునిలో మునిగి ఆనందించినాము.

హనుమజ్జయంతి సందర్భంగా పెద నిండ్రకొలను లో జరిగిన 4రోజుల సత్యంగ కార్యక్రమాలలో సుందరకాండ గురించిన ప్రవచనాలతో ఎంతో తృప్తిగా జరిగినవి. 19వతేదీన విజయవాడనుండి ఢిల్లీమీదుగా శ్రీగురు నారాయణ షడ్ధామ యాత్ర - (శ్రీ వైష్ణవీదేవి, అమృతసర్, యమునోత్రి, గంగోత్రి, కేదారనాధ్, బదరీనాధ్) జరుగుతూ ఉన్నది.

నువ్వు అణకువతో పరిశీలిస్తే ప్రతి అణువులో ఉన్నది తానే అని శ్రీ గురుదేవులే ఆ పరమ శక్తి వైష్ణవిగా అక్షర స్వరూపములో శ్రీ గురుగ్రంథ్ సాహెబ్‌గా, ఆ యా ప్రదేశాలలో ప్రతిష్ఠంపబడిన భగవంతునిగా దర్శనమిస్తూ, నామ రూపాలలో ప్రకాశిస్తున్న జగత్తులో "నామి'' తాను అని సందేశమిస్తున్నారు. అందుకనే అది అనుభవైకవేద్యము అన్నారు శ్రీ గురుదేవులు. అట్టి శ్రీ గురుదేవుల పరమ కరుణ మనందరిపైన వర్షించాలి అని ప్రార్థిస్తూ ఓం గురురామ్ నమస్తే!

- మీ అమ్మ

# సంపాదకీయం

మే నెల 9వ తేదీన వైశాఖ పూర్ణిమనాడు శ్రీ సద్గురు దేవుల పాద పూజా మహోత్సవం భక్తులు ఎంతోదివ్యంగా జరుపుకొన్నారు. శ్రీమతాజీవారు తమ అనుగ్రహ భాషణం అందించి భక్తులందరినీ ఆశీర్వదించారు. ది.10,11,12 తేదీలలో త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమాలు భవ్యంగా జరిగాయి. ఈసత్సంగ కార్యక్రమాలలో గురు సోదరులు, సోదరీమణులు అనేక ఆధ్యాత్మిక విషయాలపై ప్రవచనాలు చేశారు. శ్రీ మాతాజీ ఎంతో మంది భక్తులను పిలచి వారిచేత మాట్లాడించారు. అందరూ శ్రీ బాబూజీ మహరాజ్‌వారి బోధలను చదివి అవగాహన చేసికొని దాని సారాంశమును మానవాళికి అందించాలనీ, ప్రతి భక్తుడు ఒక వివేకానందలాగా ప్రకాశించాలన్నదే తన ఆశయమని అన్నారు.

ఈ నెల సత్సంగ సౌరభంలో శ్రీ రామకటి రామకృష్ణానంద స్వామి వారు ఇటీవల శ్రీ గతాయజ్ఞం సందర్భంగా గుండుగొలనులో చేసిన ప్రవచనం లో వారు శ్రవణం చాలా ముఖ్యమని , అలా విన్న దానిని మనన నిదిధ్యాసలలోకి తెచ్చుకొన్నప్పుడే కాలం పునీతమవుతుందని బోధించారు.

శ్రీ బాబూజీ "దివ్యవాణి'' శీర్షికలో "శ్రీ బాబూజీ గీతను నిత్య జీవితంలో ఆచరణలో పెట్టటానికి కావలసినది త్యాగము. త్యాగం అంటే నీకు ఉన్నదంతా సమర్పణ చేయటమే. 'నేను', నాది' అనే భావాలను అంటే అహంకార, మమకారాలను త్యాగం చేయాలని, మోక్షం పొందటానికి అలా ఆత్మ సమర్పణభావం పెపొందించుకున్న ప్రతి సాధకునికీ అధికారమున్నది'' అని ఉద్బోధించారు.

ఈ నెల 19న శ్రీ మాతాజీ భక్తులతో విజయవాడనుండి బయల్దేరి ఢిల్లీ చేరుకొన్నారు. అక్కడనుండి బయల్దేరి షడ్ధామ యాత్రలో భాగంగా శ్రీ వైష్ణవదేవి, అమృతసర్ దర్శించి, అనంతరం గంగోత్రి, యమునోత్రి, కేదారనాథ్, బదరీనాథ్ క్షేత్రాలను దర్శించి జూన్ 11న ఆశ్రమానికి తిరిగి వస్తారు. యాత్ర నిర్విఘ్న సమాప్తి కోసం యాత్రలో పోల్గొనే వారినే కాక, భక్తులందరినీ "ఓం నమః శ్రీ గురు నారాయణాయ'' అనే మంత్రాన్ని జపించమని, ఎంత నామం జపం చేసినదీ యాత్ర నిర్వహిస్తున్న కార్యకర్తలకు తెలిపితే అక్కడ జరిగే శ్రీ గురు నారాయణ యజ్ఞంలో ఈ నామం అర్పింపబడుతుంది అని చెప్పారు.

- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

ఒక రోజు సాయంకాలం ఇలాగే వ్రేపల్లెలోని సౌరాష్ట్రం (చౌరాస్తా)లో అందరు కృష్ణదర్శనం కోసం వేచి ఉన్నారు. ఎలాగైనా ఈ రోజు ఆ సమయం లో కృష్ణుని ఎదటికి వచ్చి, అతని ఆగడాలన్నిటిని ఏకరువు పెట్టి, బాగా మందలించాలని మన వృద్ధురాలు నిశ్చయించుకుంది.



కృష్ణుడు వస్తున్నప్పుడు ఆ సమాచారాన్ని తనకు అందించమని కొందరు పిల్లలను నియమించి, ఆ ముసలిది స్నానానికి వెళ్ళింది. స్నానం చేస్తుండగానే ఆ పిల్లలు వచ్చి "అవ్వా! కృష్ణుడు వస్తున్నాడు"అని కేకవేసి పరుగెత్తిపోయారు. ఆ కేక వినబడే అంతలోనే కృష్ణయ్య చేస్తున్న వేణుగానం వినబడింది. ఏ నాదంవిని తన ఇంట్లో పిన్నా, పెద్దా అంతా రోజూ తమ పనులన్నీ విడిచిపెట్టి, తాను చివాట్లు పెడుతున్నా వినిపించుకోకుండా, పరుగెత్తిపోయేవారో ఆ వేణునాదమే అది. కాని ఆ నాడు మరి ఏం జరిగిందో ఏమోగాని, ఆ వేణుగానం ఆమె చెవులకి సోకినంతనే, ఆమె మనస్సు తిరిగిపోయింది. "ఏమిటి? ఈ వేణుగానం ఇంత మధురమా! ఇదేమిటి? నాకు ఏదో అయిపోతున్నట్లుంది. ఇంత తీపిని, ఇంత ఆనందాన్ని, ఇంత పారవశ్యాన్ని ఎన్నడూ చవిచూడలేదే!"అనుకుంటూనే స్నానం చేస్తున్న ఆమె ఉన్నట్లుండి బయటకు పరిగెత్తింది. బయటకు వెడదాని బయల్దేరిన తన ఇంట్లోవాళ్ళందరి మధ్యనించి దూసూకునిపోతూ అతి వేగంగా బయటకు పరిగెత్తి వెడుతున్న ఆమెను చూసి, ఇంట్లోవాళ్ళు, బయటవాళ్ళు నిర్ఘాంతపోయి ఆమెను పట్టుకోవాలనివెంట పడ్డారు. ఆమె ఎవరికీ అందకుండా కృష్ణునివద్దకు వచ్చి, ఆయనను గాఢాలింగనం చేసుకుని," ప్రభూ!ఆత్మ స్వరూపా! ఓమిత్యేకాక్షర పరబ్రహ్మ స్వరూపా! ఏమి నీ దివ్యనామము! ఏమి నీ జగన్మోహనాకారము! ఏమి సర్వేంద్రియాలను మనోబుద్ధులను హరించే నీ సుమధుర మురళీగానము! ఎన్ని జన్మములకైనను, నీ దివ్య చరణారవిందముల వద్దకు చేరిన జన్మమే ధన్యము. నీ దివ్యనామ రుచి ముందు ఈ ధరణి రుచులన్నీ ఎందుకూ

కొరగానివి. నీ తత్త్వం చక్కగా తెలుసుకుని, నీ దివ్య చరణారవిందాలను ఆశ్రయించిన మావాళ్ళందరిని, నిన్ను, కూడా అర్థం చేసుకోలేని వ్యర్థురాలనై నిన్ను, నీ భక్తులైన మా వాళ్ళను ఎన్నో విమర్శనా వాక్యాలతో నిందించాను. కాని దయామయుడవైన నీవు ఈనాటి మురళీగానం ద్వారా నాకు నీ నిజతత్వాన్ని అందించావు. నీ ఈ దివ్యరూపాన్ని దర్శింపచేశావు. స్పర్శింపచేశావు. ఇన్ని తప్పులు చేసినా, నన్ను ఇలా అనుగ్రహించిన ఈ అవ్యాజ ప్రేమను ఎలా తెలుసుకోగలను? ఏమని పాడగలను? నన్ను రక్షించు ప్రభూ! నా అపరాధాలన్నిటినీ మన్నించు ప్రభూ! నీవు నంద యశోదా తనయుడవు కావు. ఆది మధ్యాంతరహితుడవైన పరబ్రహ్మవు. నిన్ను, నీ భక్తులను నిందించి ఈ జన్మలో చేసిన మహాపాపాన్ని , నా జన్మ జన్మాంతర పాతకాలను హరించి నన్ను క్షమించేవరకు, నన్ను నీలో చేర్చుకునేవరకు, నిన్ను వదలను. అలా అభయమిస్తేనే నిన్ను వదులుతా''నని ఆమె కృష్ణుని తన గాఢాలింగనంలో బంధించివేసింది. ఆమెను వారించటానికి వచ్చిన ఆమె భర్త కూడా ఆమెను తాకగానే అలాగే ఉండిపోయాడు. "ఎన్నో భాగ్యాలు అనుభవించాను గాని ఇట్టి ఆనందము ఎన్నడూ చవిచూడలేదు. తాకితేనే ఇంత ఆనందమైతే ఇక అర్థం చేసుకుని అనుభవించిన ఆనందం ఎంత గొప్పదో! '' అనుకుంటూ తన్మయుడైపోయాడు. ఇలా వ్రేపల్లె వాసులంతా అక్కడ ఒకరినొకరుతాకి, ఆ స్వామి నామస్మరణలో, ఆదివ్య వేణుగాన మాధుర్యంలో, ఆనంద పారవశ్యంలో ఓలలాడుతూ తన్మయులైపోయారు.

వ్రేపల్లెలో నాలుగు వీధుల కూడలిలో ఇది జరిగింది. ఆ వ్రేపల్లెయే మన దేహం. ఆ నాలుగు వీధులే మన మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు. ఆకూడలిలో మధ్య వెలిగే స్వామియే ఆత్మ వస్తువు. వ్రేపల్లె వాసులంతా ఆ స్వామి యందు మనసు నిలిపి ఎలా తరించారో అలాగే మనమందరము మన మనో, బుద్ధి, చిత్త, అహంకారములను ఆ స్వామికి అర్పించి ఆ సౌరాష్ట్ర మధ్యంలో స్వామిని నిలుపుకుని, ఆ స్వామి దివ్యస్మరణతో మన జన్మలను చరితార్థము చేసుకొందుము గాక! అఖండ భక్తి, జ్ఞాన, వైరాగ్యములను, సమస్తభోగ భాగ్యములను ప్రసాదించి సర్వదా గురు పాదుకలు మిమ్ము కాపాడుగాక!

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

మనస్సు చాలా గొప్పది. ఏదో విధంగా మనని దిగజార్చి వేయాలని చూస్తూ ఉంటుంది. సత్వ, రజ, స్తమో గుణాలని, ఈషణత్రయాలని, అనేక రకములైన ఎరలని చూపించి మనని మన లక్ష్యం నుండి దూరం చేయాలని చూస్తుంది. దీనికి మనం బుద్ధుడి చరిత్రని చెప్పుకోవచ్చు. ఎందుకంటే ఆయన మనసుయొక్క వలలో చిక్కకుండా బయటపడ్డారు కనుక.



సిద్ధార్థుడు (బుద్ధుడి పూర్వ నామధేయం) శుద్ధోధన మహరాజు యొక్క కుమారుడు. ఆయన జన్మించినప్పుడే జ్యోతిష్కులు ఆయన ప్రపంచానికి అతీతుడనీ, ప్రపంచ బంధాలేవీ ఆయన్ను బంధించలేవనీ చెప్పారు. అది విన్న మహారాజు తన కొడుకు తనకు కాకుండాపోతాడేమో అని భయపడి బయట ప్రపంచం అంటే ఏమిటో తెలియకుండా నిర్విరామంగా రాజభోగాలలో మునిగి ఉండే విధంగా సిద్ధార్థుడిని పెంచసాగాడు. చక్కని చుక్క అయిన యశోధర అనే కన్యను తెచ్చి అతడికి వివాహం చేశారు. చూడండి! మన కాలంలో కూడా ఇలాగేగా జరుగుతోంది. పిల్లలు సినిమాలకీ, క్లబ్బులకీ వెళ్ళి చెడిపోయినా బాధపడరు గాని, అదే ఏ ఆశ్రమానికో, పురాణ కాలక్షేపానికో వెళ్తామంటే 'అయ్యో! ఇప్పుడి నుంచే ఇవన్నీ నీకెందుకురా?' అంటారు ఈనాటి తల్లిదండ్రులు.

శుద్ధోదన మహారాజు ఎంత పకడ్బందీగా సిద్ధార్థుడిని పెంచినా విధివ్రాతని ఎవరూ మార్చలేరు గదా! వ్యాహ్యాళికని వెళ్ళిన సిద్దార్థుడికి రోగం, వృద్ధాప్యం, మరణం కనిపించాయి. అంతే, ఆయన మనస్సు విచారణలోకి వెళ్ళిపోయింది. అదే గొప్ప సంస్కారమంటే. 'ఈ ప్రాపంచిక విషయాలన్నీ అశాశ్వతమైనవేనా? అయితే మరి శాశ్వతమైన వస్తువు ఏది?' అని ఆయనలో తీవ్రమైన జిజ్ఞాస మొదలైంది. బాహ్య ప్రపంచాన్ని చూసిన మరుక్షణమే ఆయన మనస్సు దానియొక్క అసత్యాన్ని గురించి విచారణ మొదలుపెట్టింది. 'ఇంతగా

ప్రేమిస్తున్న ఈ శరీరం వ్యాధికి గురి అవ్వవచ్చు. పరిణామం (మార్పు) చెంది వృద్ధాప్యం స్థితికి వెళ్ళవలసిందే. ఏనాటికైనా ఈ శరీరానికి మృత్యువనేది తప్పదు కదా! ఇవన్నీ అశాశ్వతమే అయినపుడు మరి శాశ్వతమైనది ఏది? ఈ జన్మ, వ్యాధి, జరామరణముల నుండి తప్పించుకునే మార్గమేది? ఆ సత్యాన్ని నేను తెలిసికొని తీరాలి' అని తత్త్వాన్వేషణలో ఇల్లు వదిలి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుంటాడు. నాలుగడుగులు ముందుకు వేసేసరికి ఒక బంగారు ఉయ్యాలలో నిద్రిస్తున్న ముద్దులొలికే తన ఏకైక కుమారుడు రాహులుడు గుర్తుకు వస్తాడు. దీనినే పుత్రేషణ అంటారు. మనసు పుత్రుడిని ఎరగా చూపించి సత్యాన్వేషణ నుండి వెనకకు మరల్చాలని చూస్తుంది. 'ఊహు!.. నేను ముందుకే వెళ్ళాలి' అని అడుగు ముందుకి వేస్తాడు సిద్ధార్థుడు. నాలుగడుగులు వేసేసరికి భార్య మీదకు లాగింది మనసు. 'అయ్యో! నా కోసం తన వాళ్ళందరినీ విడిచి వచ్చింది కదా! ఎంతటి సౌందర్యరాశి! ఆమెను విడచి ఎలా వెళ్ళాలి?' అనుకుంటాడు. ఇదే దారేషణ (భార్యపై వ్యామోహం). దీనినీ ఛేదించాడు. సింహద్వారం దగ్గరకు వచ్చేసరికి తానింతవరకూ అనుభవించిన భోగభాగ్యాలు, సిరిసంపదలు వెనకకు మరల్చుదామని చూశాయి. ఈ ధనేషణని (ధన వ్యామోహం) కూడా తెగనరికి బయటపడ్డాడు సిదార్థుడు. తీవ్ర వైరాగ్యమనే ఖడ్గంతో ఈషణత్రయాలని అంటే (భార్య, పుత్రులు, ధనములపై వ్యామోహాన్ని) చేధించాడు. ఆయన మనస్సు విషయాదులకి లొంగలేదు. అకుంఠిత దీక్షతో సత్యాన్వేషణ చేశాడు. తాను చేరవలసిన లక్ష్యాన్ని సాధించి బుద్ధుడయ్యాడు. ఆయనే మనకి 'మాం శరణం శరణం గచ్ఛామి. సత్యం శరణం గచ్ఛామి ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' అనే మహావాక్యాలను ప్రసాదించాడు. శ్రీగురుమహరాజ్ మన నిత్యప్రార్థనలో ఆ మహావాక్యాలని చేర్చారు. ప్రార్థనానంతరం అవి ఉచ్ఛరిస్తే మనకి ప్రార్థన యొక్క సంపూర్ణ ఫలితం లభిస్తుంది. తత్త్వ విచారణ ద్వారా మనస్సుని పరిశుద్ధం చేసికొని, తద్వారా మనస్సుని తన ఆధీనంలోకి తెచ్చుకుని మహాత్ముడయ్యాడు సిద్ధార్థుడు.

- సశేషం

## సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

శ్రీబాబు మాట్లాడుతూ అదే అజ్ఞానం. పులిలో, రాతిలో, ఉన్నది ఒకే చైతన్యం. అందుకు సందేహం లేదు. మరి పులి అలా క్రూరంగా ఎందుకు ఉండాలి అని మీకు సందేహం కలుగవచ్చు. దీనికి మీకు ఒక దృష్టాంతం చెబుతాను. రెండు వృక్షాలు ఉన్నాయి. ఒక వృక్షం వైద్యంలో పనికి వచ్చే మంచి మూలికను ఇస్తుంది. కాని అది దుర్గంధాన్ని కలిగి ఉందనుకోండి. దానిలో శక్తి లోపించిందా? లోపించలేదు. పాము ఉందనుకోండి. అది విషపూరితమైనదే అయితే దానిలో చైతన్యం లేదని చెప్పగలరా? అలాగే రెండవ వృక్షం మంచి సుగంధాన్ని ఇస్తుంది. అంతవరకే దాని ప్రయోజనం. మరి ఈ రెండింటికి డిఫరెన్స్? కాబట్టి తేడా అజ్ఞానమనే మన దృష్టిలో ఉంది గాని, వస్తువులో లేదు. భావన అనేది మన అజ్ఞానం.

తరువాత మూర్తీజీ రెండవ పాటకి వ్యాఖ్యానం చెబుతూ 'ఎన్ని జన్మలకైనా నీ పాదదాసుడనై సేవిస్తాను' అని శ్రీకృష్ణపరమాత్మను గురించి చేసిన గానం అది.

శ్రీబాబు మాట్లాడుతూ 'మరి నీవూ అంతేనా?' అని ప్రశ్నించారు. ఆయన సమాధానం చెబుతూ ఎన్ని జన్మలకైనా మీ పాదదాసుడనై ఉండాలనే నా కోరిక బాబు అన్నారు. అంటే ఈ జన్మలోనే స్వామితో ఐక్యం కావాలని కోరుకోవు అన్నమాట అన్నారు శ్రీబాబు. సరే ఈ జన్మలో కాకపోయినా సరే స్వామి పాదసేవనే ఎన్ని జన్మలకైనా కోరుకుంటాను అన్నారు మూర్తిజీ. శ్రీబాబు మాట్లాడుతూ అయితే నిన్ను తరింపజేయటానికి నన్ను కూడా ఇలా జన్మలెత్తమంటావన్నమాట అన్నారు.

గురుశక్తి ఎలా ఉంటుందో మీకో దృష్టాంతం చెబుతాను. అయస్కాంతం ఇనుమును ఆకర్షిస్తుంది. ఇనుమును ఆకర్షించినంత మాత్రాన అయస్కాంతం తన శక్తిని కోల్పోతుందా? ఇనుముకి అయస్కాంతం తన శక్తిని వ్యాప్తం చేస్తుంది. కాని అయస్కాంతం యొక్క శక్తికి లోటు ఉంటుందా? అలా ఎన్నడూ జరగదు.

ఇంకొక దృష్టాంతం చెబుతాను. పరశువేది స్పర్శ చేత ఇనుము బంగారంగా మారుతుంది. పరశువేది వేదాంత సారాన్ని అందించి పరతత్వాన్ని

బోధిస్తుంది అని చెబుతూ అందరివంక పరికించి చూస్తూ 'అయ్యో! మీకందరికి చలివేస్తోందా? అయితే నేను కూడా చొక్కా వేసికొని వస్తాను' అనిలేవబోయారు శ్రీబాబు. వెంటనే విషయాన్ని గ్రహించి మేమంతా చొక్కా విప్పబోయాము. శ్రీబాబు మాట్లాడుతూ ఉండండి. ఇప్పుడు ఎందుకు? వ్రతం చెడిన తరువాత పతివ్రత ఏమిటయ్యా అన్నారు.

ఇంతలో మూర్తీజీ శ్రీబాబును ప్రశ్నిస్తూ 'నేను విచారణ చేసేటప్పుడు ఒక అనుమానం వచ్చింది బాబు. పరమాత్ముడు సర్వవ్యాపకుడు కదా! ఆయన లేని వస్తువు ఉందా? అలా అయితే చైతన్యం లేనిదాన్ని జడము అంటారు కదా! జడమైన వస్తువులో పరమాత్మ లేదా?' అని అడిగారు.

శ్రీబాబు మాట్లాడుతూ 'అదే అజ్ఞాన దృష్టి. క్రూరజంతువైన వ్యాఘ్రములోను, సాధుజంతువైన గోవులోను, కాకిలోను, పర్వతములోను, మానవునిలోను ఉన్నది ఒకే ఆత్మవస్తువు. అలాగే జడమైన వస్తువుని ప్రకాశింప జేసేది పరమాత్మ వస్తువే. అయితే వ్యాఘ్రం క్రూరంగా, వస్తువు జడంగా మనకి గోచరించటమే అజ్ఞానము. అది మన భావనే గాని ఏమీలేదు. అది మన దృష్టి దోషమే. మృతి చెందిన దేహాన్ని ప్రేత లేక శవము అంటారు. అందులో ఏ శక్తీ లేకపోతే దానిని దహనము చేసినప్పుడు అది ఎలా దహించుకు పోయి బూడిదగా మారుతోంది?' అని ప్రశ్నించారు. నీవు నిదురించేటప్పుడు కూడా నీలో ఒకడు ఉన్నాడు. వాడు ఎవరు? అని ప్రశ్నించారు. అదే ఆత్మ వస్తువు. దానికి నిద్రలేదు. అది గోచరించదు. దానికి రూపం లేదు. కాని అది నీ ఇంద్రియముల అన్నింటికి ప్రకాశము నిస్తుంది. పరమాత్ముడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. ఆ విషయాన్ని తెలుసుకోవటం కష్టము. కారణం ఏమిటంటే ఆయనని మనం చూడలేము కాబట్టి. ధృతరాష్ట్రుడు సాక్షాత్తు కృష్ణుడిని దర్శించి ఆ కన్నులతో ఇంక దేనినీ చూడనన్నాడు. కాని తన కుమారులకి పాండవులను గూర్చి నచ్చచెప్పగలిగాడా? కనీసం దుర్యోధనునికి నచ్చచెప్పటానికి ఎందుకు ప్రయత్నించలేదు? యశోద తన పుత్రుడు సాక్షాత్తు నారాయణమూర్తే అని తెలిసికొన్నప్పటికి అది చివరవరకు నిలిచిందా? వెంటనే మాయ కమ్మేసింది. ఆ విషయం అలా ఉంచండి. అన్నీ తెలిసిన కృష్ణపరమాత్మకు కురుపాండవులకు యుద్ధం జరుగుతుందని తెలుసు. యుద్ధంలో కౌరవులు సంహరింప బడతారని తెలుసు. అయినప్పటికి కౌరవులతో రాయబారానికి ఎందుకు వెళ్ళినట్లు తారకం?

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**జూన్ 2009**

| | | |
|---|---|---|
| 1 | సోమ | శ్రీ సుగుణప్రసాద మాతాజీవారి ద్వితీయవార్షిక పుణ్యారాధన,శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం. |
| 7 | ఆది | పూర్ణిమ,శ్రీ సద్గురు పాదపూజ. |
| 17 | బుధ | శ్రీగురుదశమి, సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ. |
| **12, !3, 14** | | సత్సంగ కార్యక్రమాలు. |
| 21 | ఆది | మాసశివరాత్రి. |

**జూలై 2009**

| | | |
|---|---|---|
| 2 | గురు | తొలిఏకాదశి, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన. |
| 7 | మంగ | ఆషాఢ వ్యాస పూర్ణిమ,శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన. (చతుర్మాస్య దీక్షలో మొదటి నెలలో శ్రీ మాతాజీ అమెరికాలో ఉంటారు |
| 17 | శుక్ర | శ్రీగురుదశమి, సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ. |
| 20 | సోమ | మాసశివరాత్రి. |
| 22 | బుధ | సూర్యగ్రహణము |
| **29, 30, 31** | | సత్సంగ కార్యక్రమాలు. |
| 31 | శుక్ర | వరలక్ష్మి వ్రతం. |

## శ్రద్ధాంజలి

ఆశ్రమ భక్తులందరికి కోటిపల్లి మామ్మగా సుపరిచితురాలైన హనుమంతు వఝుల శేషమ్మగారి దౌహిత్రురాలైన కోడూరు సీతారామాంజనేయాంబ గారు కొంతకాలం అస్వస్థులుగా ఉంటూ నిరంతర గురునామ స్మరణతో ది.2.5.2009 శనివారంనాడు గురుసాయుజ్యం పొందారు. వీరి వయస్సు 75 సంవత్సరాలు. వీరికి నలుగురు కుమార్తెలు కలరు. శ్రీగురుదేవులు వారికి కుటుంబ సభ్యులకు ఆత్మశాంతిని ప్రసాదించెదరు గాక!

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

(డిశంబరు 9నుండి 11 వరకు గుండుగొలనులో జరిగిన శ్రీశ్రీశ్రీ సద్గురు గీతా యజ్ఞంలో 10వ తేదీన పరమహంస పరివ్రాజక పరమపూజ్య శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామివారు అందించిన బోధామృత సారాంశం పాఠకులకు అందిస్తున్నాం. - ఎడిటర్)

ముందు శ్రవణం చేయాలి. విన్నదానిని మననం చేసి నిదిధ్యాసలోకి తెచ్చుకోవాలి. అలా చేసికొన్నప్పుడే కాలం పునీతమవుతుంది. కాలం భగవంతుని స్వరూపం అని ఎరిగి ప్రతిక్షణం భగవంతుని స్మరించమని చెప్పింది భగవద్గీత. పురాణాలలో విష్ణు పురాణం ఎంత గొప్పదో , భారతంలో భగవద్గీత అంత గొప్పది. కాండ త్రయాత్మకమైనది.

**మత్తః పరతరంనాన్యత్ కించిదస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణి గణా ఇవ ॥**

అర్జునా! నాకన్న భిన్నమైనది ఏదీ లేదు. ఈ సర్వసృష్టిలో ఓతప్రోతములలాగా నేనే వ్యాపించిఉన్నాను. ఒక మణులు కూర్చిన హారములో ఆ మణులనన్నిటిని కలిపి ఉంచుతూ కనపడకుండా ఉన్న దారంలాగా నేను అంతటా వ్యాపించి ఉంటాను. నాకు మినహా వేరే వస్తువు లేదు. ఈ జగత్తు స్వప్నం వంటిది. ఈ స్వప్న ప్రపంచాన్ని నా యందు దర్శింపచేస్తున్నది ఎవరు? అంతర్దృష్టితో చూస్తే ఈ ప్రపంచంగా కనిపిస్తున్నది బ్రహ్మము అని తెలుస్తుంది..

ఈ ప్రపంచంలో కార్య కారణాలు రెండు ఉంటాయి. కారణం లేకపోతే కార్యం ఉండదు. భగవద్గీత కర్మ షట్కంలో భగవంతుడు నైష్కర్మ్య సిద్ధిని గురించి చెప్పాడు.

**న కర్మణా న ప్రజయా ధనేన**
**త్యాగేనైకే అమృతత్వ మానశుః**

అమృతత్వము కర్మల వల్ల కాని, సంతానం వల్ల కాని, ధనాదుల వలన కాని కలిగేది కాదు. ఒక్క త్యాగం వల్ల మాత్రమే సిద్ధిస్తుంది. కాని మానవుడు నేను ఇంత సంపాదించాను, నేను ఇంత చదివాను, నేను ఇంత పెద్ద ఉద్యోగం

చేశాను అంటాడు. దానికి కారణం దేహాభిమానమే. అది అంత తేలికగా వదలదు. అన్నీ చదివాను అంటావు. అయినా నేను దేహం అనే భావం పోలేదు.

యాజ్ఞవల్క్యులవారు తమ బోధను జనకుడు వస్తే గాని మొదలు పెట్టేవారు కాదు. శిష్యులు తమ గురువుగారు జనకమహారాజుపై విశేషాభిమానం చూపిస్తున్నారు అని ఈర్ష్య చెందారు. "నాది అనేది ఏది ఉన్నది? వీటి అన్నిటికీ సాక్షి దేహంలో ఉన్న దేహి. ఈ దేహం నీవు కాదు. నీవు శరీరమై చెపుతున్నావా? లేక శరీరానికి సాక్షివై చెపుతున్నావా? అలాగే మనస్సు, బుద్ధి, చిత్తం నీవు కాదు. నీవు ఇవన్నీ తెలుసుకొనే బుద్ధికి సాక్షివి. ఇలాంటి మహత్తర విషయం చెపుతుంటే జనకుడు వింటున్నాడు. ఆ సమయంలో యాజ్ఞవల్క్యుల వారుమిథిలలోని రాజ ప్రాసాదం కాలిపోతున్నట్లు చూపించారు. సైనికులు వచ్చి మొర పెట్టుకున్నా జనకుడు కదలలేదు. యాజ్ఞవల్క్యులవారు "ఏమిటి అలా కూర్చున్నావు?'' అని అడిగితే ఈ మిథిల అనే శరీరం ఎలాగూ తగలబడేదే! కాని అందులో ఉన్న నేను అనేది తగలబడేది కాదు, అన్నాడు జనకుడు. యాజ్ఞవల్క్యులు "జనకుడు రానంత వరకు ఎందుకు మొదలు పెట్టలేదో ఇప్పుడు అర్థం అయిందా?'' అన్నారు శిష్యులతో. అట్టి తదేక నిష్ఠాగరిష్ఠత్వం ఎవరికి ఉంటుందో వాడే అధికారి.

**అథాతో బ్రహ్మ జిజ్ఞాసా।** ఏది అయిన తరువాత? సాధన చతుష్టయ సంపత్తి కలిగిన తరువాత అధికారిత్వం కలుగుతుంది. భగవద్గీత రెండవ అధ్యాయం 54 వ శ్లోకం నుండి 72 వ శ్లోకం వరకు భగవానుడు అర్జునునికి స్థిత ప్రజ్ఞుని లక్షణాలను చెపుతాడు. దానిని డా॥ రాధాకృష్ణన్ గారు **స్థిత ప్రజ్ఞ వైభవం** అని వ్రాశారు.

వివేకం, వైరాగ్యం అంటే ఉన్నదేదో, లేనిదేదో విచారణ చేస్తాడు. చెయ్యవలసింది నిజమైన విచారణ. శాస్త్రాలు చదవటం ఒకఎత్తు. తనను తాను తెలుసుకోవటం ఒక ఎత్తు. "తనను తా దెలిసిన తానే దైవము రా' అన్నారు యోగి నారాయణ స్వామి. అన్నిటినీ తెలుసుకుంటున్నాం కాని తనను తాను తెలుసుకునే 'తానును' మరుస్తావు. జ్ఞానివి అయ్యే ఉన్నావు.

దీనికి ఉదాహరణ రజ్జు - సర్ప భ్రాంతి. తాడును పామనుకోవటం. మార్పు నీ యందే వచ్చింది. తాడుకు కాదు. మార్పు నీ మనస్సులో వస్తోంది. అసలు నీ స్వరూపమేమిటి? నువ్వు చూస్తున్న ఈ భౌతిక దేహం నీవేనా?

తనలోన సర్వముండగ। దన లోపల వెదుక లేక ధర వెదకెడి యా।
తనువుల మోసెడి ఎద్దుల। మనముల దెల్పంగ వశమె మహిలో వేమా॥

తత్త్వమంతా తనలో ఉండగా ఎచటనో కలదని వెదకు అవివేకులు దేహము బరువు మోసెడి ఎద్దులవంటి వారు అన్నాడు వేమన.

స్వామి వివేకానంద అమెరికా వెళ్ళాడు. ఆయన వర్చస్సుకు అమెరికన్లు ఆకర్షింపబడ్డారు. ట్రెయిన్ దిగాక వివేకానంద వద్దకు వారు వచ్చి "మీకు లగేజ్ ఉందా?'' అని అడిగారు. దానికి వివేకానంద "ఉంది 60 కేజీలు'' అన్నారు. "ఏది మీ లగేజ్?'' అంటే. ''నా శరీరమే'' అన్నారు స్వామి వివేకానంద.జ్ఞానికి తాను ధరించిన శరీరమే లగేజ్.

శరీరము రథము. ఇంద్రియాలు గుర్రాలు. శబ్ద, రూప, రస గంధాదులు మార్గాలు. ముందు నువ్వు సకామ కర్మ విడిచి పెట్టు. నిష్కామ కర్మ చెయ్యి. నువ్వు చేసే కర్మకు ఫలం నీ భావం వల్ల కలుగుతుంది. దక్షుడు యజ్ఞం చేసి ఏ ఫలం పొందాడు? **యజ్ఞో వై విష్ణుః** అనే భావంతో చెయ్యలేదు. యజ్ఞం విఫలమైంది. భగవంతుడికి ఏ పక్షపాతము ఉండదు. ఎవరిపైనా ద్వేషం ఉండదు. మనపై ఉండేది ప్రేమే.

అర్జునుడు - కర్మయోగంలో చెప్పింది కర్మే అవుతుంది కదా?

కృష్ణ - అది కర్మే. కామం లేకుండా చేస్తే ఆ కర్మ ఫలం నీకు అంటదు.

నిజమైన ధ్యానం ఏది అంటే - నాసికాగ్రంపై చూపు నిలిపి, వచ్చే పోయే ప్రాణ అపాన వాయువులను గమనించటం. మనస్సులో సంకల్ప వికల్పాలు రానీయకు. అప్పుడు నీ మనస్సు ఆత్మలో లీనమవుతుంది. ఊరకఉంటే దేవుడు, ఊగులాడితే జీవుడు. కష్ట సుఖాలు నువ్వు కోరకపోయినా వస్తాయి. ప్రహ్లాదుడు" నువ్వు సుఖాల గురించి తాపత్రయ పడతూ కాలాన్ని ఎందుకు వృథా చేస్తావు? కష్ట, సుఖాలకు నువ్వు సాక్షివి మాత్రమే'' అంటాడు కర్మషట్కం ఈ విషయం చెపుతుంది. కర్మ సన్యాసం చెపుతుంది. తపస్సు చేస్తే కిల్బిషం పోతుంది. యజ్ఞ, దాన,తప క్రియలు చేసేటప్పుడు భావం గొప్పగా ఉండాలి. నీ దగ్గర ధనం లేకపోవచ్చు. భావానికి దరిద్రమేముంది? అలాగే ప్రపంచం ఉందనుకోవటమూ నీభావనే, లేదనుకోవటమూ నీ భావనే. నీ భావాన్ని పునీతం చేసుకో. సత్యరూపమైన జ్ఞానం నీవై ఉన్నావు. దానిని విస్మరించటమే మూర్ఖత్వం. పునీతమైన భావాన్ని పెట్టుకో. హాయిగా కూర్చో. అయమాత్మా బ్రహ్మ అనే భావంలో ఉండు. అనుకున్నా అనుకోకపోయినా నువ్వు బ్రహ్మవే. అనుకుంటుంటే ఆ సత్యాన్ని గుర్తిస్తావు. *

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

పాండురంగడి దివ్యమూర్తి అనంతకోటి ప్రభలతో దేదీప్యమానంగా వెలిగిపోతుంటే, ఆ నిశ్శబ్దంలో నుండి పాండురంగడి మేఘ గంభీరస్వరం నామదేవుడి కర్ణేంద్రియంలో గింగురుమని మ్రోగింది 'నామా! గృహస్థ ధర్మం కూడా పవిత్రమైనదే. అదీ ముఖ్యమైనదే. ఇంట్లో వారిని కూడ సుఖపెట్టు.' ఆకర్ణాంతములైన తన విశాలనేత్రాల నుండి కరుణామృత వృష్టి కురిపిస్తూ అత్యంత వాత్సల్యంతో నామదేవుణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు పాండురంగడు. నామదేవుడికి బ్రహ్మానందం కలిగింది. అతడి మనస్సు సమాధానపడింది.

ఋతుచక్రం తిరుగుతున్నది. ఒకనాడు తెల్లవారుజామున కాకడ ఆరతికి వెళ్దామని నామదేవుడు బయలుదేరుతున్నాడు. ఇంట్లోనుంచి కేర్ కేర్ అంటూ అప్పుడే పుట్టిన శిశువు ఏడుపు వినిపించింది. రాజాయి వంశోద్ధారకుణ్ణి ప్రసవించింది. దామాశెట్టిగారి వంశలత మారాకు తొడిగింది. పన్నెండవరోజు రాజాయి ఒడిలో పసిపిల్లవాణ్ణి చూసిన నామదేవుడు మనస్సులో తప్పుచేసిన వాడిలాగ బాధపడ్డాడు. అందరికీ విషయవాసనల జోలికి పోవద్దు అని బోధిస్తూ వీడు మాత్రం ఎంచక్కా పిల్లలను పుట్టిస్తున్నాడు అనుకోరా జనం? ఆనాడు బారసాల. నామదేవుడు తనకు ఇష్టంలేదన్నాడు. ఐతే వెళ్ళి విఠలుడికే చెప్పుకో ఈ బారసాల జరిపించమని అని కటువుగా అన్నది జని. నామదేవుడు ఒక్క అంగలో బైటపడ్డాడు. వెళుతున్న నామదేవుడివైపే చూస్తూ అనుకున్నది జని. ఈ నామదేవుడు ఇంకా అసంపూర్ణంగానే ఉన్నాడు. అందరిలో దేవుణ్ణి చూడమని అందరికీ చెప్తూ తిరుగుతున్నాడేకాని, తన బాలుడిలో బాలకృష్ణుణ్ణి చూడలేకపోతున్నాడు. సద్గురు ప్రాప్తి కలగనిదే ఇతనికి పూర్ణజ్ఞానం కలగదు.' రాజాయి కల్పించుకుంటూ'జనీ! బాధపడకు. ఈయన పిచ్చి నాకు బాగా అలవాటే. ఆయనలేకపోతేనేం? సాక్షాత్తు ఆ పాండురంగడే ప్రత్యక్షంగా వచ్చి, బారసాల జరిపించి, నామకరణం చేసి మరీ వెళతాడు. నీవు ధైర్యంగా ఉండు'అంది. జని రాజాయి దృఢ విశ్వాసానికి ముగ్ధురాలైంది. అవును "నీవు పాండురంగడిపై నీ విశ్వాసాన్ని అలాగే ఉంచు. అతడే వచ్చి బారసాల, నామకరణం తప్పక చేస్తాడు" అన్నది.

గుళ్ళోకి వెళ్ళిన నామదేవుడు అభంగం పాడి కళ్ళు తెరిచి చూశాడు. విఠలుడి విగ్రహం కనిపించలేదు. ఎక్కడ? ఎక్కడ? అని అందరినీ అడుగుతూ ఎవరో అక్కడ ఉన్నాడు అంటే చంద్రభాగ ఇసుకతిన్నెలవైపు పరిగెత్తాడు.

నామదేవుడి ఇంట్లో బారసాల సంబరం చక్కగా జరిగింది. నామదేవుడు ఎంతో హుందాగా వ్యవహరించాడు. పిల్లవాడికి క్రొత్తబట్టలు, ఆటవస్తువులు అన్నీ పట్టుకొచ్చాడు. సమయానికి ఇంట్లో ఉన్నాడు అని రాజాయి ఎంతో సంతోషించింది. 'ఏం పేరు పెడతావు మీ అబ్బాయికి?' జని అడిగింది. "నారాయణ అని పెడదాము. అది చాలమంచి పేరు," నామదేవుడు మధురంగా నవ్వాడు. జనికి ఆనందంతోపాటు నామదేవుని ప్రవర్తన ఆ మధురహాసం చూస్తుంటే ఏదో అనుమానం కలిగింది. ఆమెకు వెంటనే అవగతమైంది, సాక్షాత్తు పాండురంగడే అక్కడ నామదేవుడి రూపంలో ఉన్నాడు అని.

చంద్రభాగ ఇసుకతిన్నెలలో పాండురంగడి కోసం వెతుకుతున్న నామదేవుడికి వాసుదేవ్ కనిపించాడు. నామ విచారంగా ఉండటం చూసి, సంసార సాగరాన్ని తరించాలంటే జీవుడే బ్రహ్మము అన్న జ్ఞానం కలగాలి, దానికి గురువుకావాలి అని చెప్పాడు. నివృత్తినాధ్, జ్ఞానదేవ్, సోపానదేవ్, ముక్తాబాయి అందరూ ఆషాఢ ఏకాదశినాడు పండరిలో ఉంటారు అన్న శుభవార్త చెప్పాడు. బాగా ప్రొద్దుపోయి ఇల్లుచేరుకున్న నామదేవుడి చేతులో తంబూర అందుకుంటూ జని అంది' ఇప్పుడా రావటం. బారసాల సంబరం అంతా ఎప్పుడో అయిపోయింది.' ఆశ్చర్యపోతున్న నామదేవుణ్ణి చూస్తూ తిరిగి జని 'ఏం నీవు లేకపోతే ఆగిపోతుందనుకున్నావా? పిల్లవాడికి క్రొత్త అంగీ, టోపీ, ఆటవస్తువులు అన్నీ తీసుకొని సాక్షాత్తు విఠలుడే వచ్చాడు. నారాయణ అని పేరు కూడ పెట్టాడు' అన్నది.

నామదేవుడికి స్ఫురించింది. అంటే తనకు గుళ్ళో విఠలుడు కనిపించనప్పుడు................ అంతే. తప్పక అదే జరిగింది. అప్పుడు విఠలుడే స్వయంగా ఇక్కడకు వచ్చి బారసాల జరిపించాడు. పేరు కూడ పెట్టాడు. నామదేవ్ కళ్ళు శ్రావణమేఘాలలా వర్షిస్తున్నాయి.

ఆషాఢ శుద్ధదశమి వచ్చింది. గుళ్ళో సంకీర్తనలో లీనమైన నామదేవుణ్ణి కుదిపి-ఈ లోకంలోకి తెచ్చి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఆదిమాయతో సహా పండరివచ్చారని చెప్పింది జని. నామదేవుడు ఒక్కగంతులో బయట పడ్డాడు.

- సశేషం

# ఉదంక మేఘాలు

-శివ ప్రసాద్

ఉదం -( తనకళ్ళను కప్పిన పొర ఏదో తొలగినట్లై సంభ్రమంగా అత్యంత వినయంతో కేల్మోడ్చి కృష్ణుడికి నమస్కరిస్తూ) హే కృష్ణా!హే మహానుభావా!నీ మహామహిమమును ఎరుగుదును. నీవు పురుషోత్తముడవనీ ఎరుగుదును. ఇప్పుడు నీవు చెప్పినదంతాకూడ ఎరుగుదును. అయినా దురాగ్రహ గర్వము నా మనస్సును కప్పి, నేను భ్రష్టుడనై బ్రహ్మనిష్ఠనుండి చ్యుతుడనై దిగజారే స్థితికి వచ్చాను. తండ్రీ! అటువంటి నన్ను కరుణించి అనుగ్రహించటానికి నీవే నన్ను స్వయంగా వెతుక్కుంటూవచ్చావా ప్రభూ! ఎటువంటిది నీ కరుణ! నీ వాగమృతఝరితో నన్ను ఆ వినాశంనుండి రక్షించావా స్వామీ! ఇలా అడగటానికి నాకు అర్హత ఉన్నదో లేదో తెలియదు. కాని ఈడులేని నీకృపకు నేను పాత్రుడనని నీకనిపిస్తే, నాకు కన్నులపండువుగా, నా నస్సు రంజిల్లేలా అసదృశమైన నీ నిజరూప సందర్శన నాకు కలిగించు.

ఉదంకుడు అలా వేడగానే దయాళుడైన హరి అలనాడు అర్జునునికి తాను చూపిన విశ్వరూపమును ఉదంకునికి చూపించాడు. ఆ విశ్వరూపమును దర్శించిన ఉదంకుడికి ఒకవైపు సంభ్రమంతో, ప్రమోదంతో ఒడలు పులకరిస్తుంటే మరొకవైపు వెరపుతో ఒడలు గగుర్పాటు చెందుతున్నది. విస్మయంతో చేష్టలు దక్కి చూస్తున్నాడు. అంతలోనే అతనిలోని అష్ట సాత్విక ప్రవృత్తులు జాగృతము కాగా, కనులవెంట ఆనందాశ్రువులు ధారలుగా కారుతుంటే, గద్గదకంఠంతో, కంపిస్తున్న గాత్రంతో ఆ మునిశేఖరుడు "నమః పురుషోత్తమాయ తే'' అంటూ అత్యంత వినమ్రంగా నమస్కరించి, కృష్ణుడు ప్రసాదిస్తున్న ఆ ఆనందాన్ని కొంతసేపు నిశ్చలంగా అనుభవిస్తూ ఉండిపోయాడు. తరువాత కొంతసేపటికి తేరుకొని...

ఉదం - ఓ పుండరీకాక్షా! ఈ పృథ్వీ మండలమంతా నీ పాదతలం క్రింద ఒక రేణువుగా ఉండటం చూశాను. నిన్ను చుట్టి ఆవరించిన ఆకాశమంతా అనేకములైన నీ శిరస్సులతో నిండిపోయి ఉంది. అంతరిక్షమంతా నీ కుక్షి అయిన సత్యాన్ని దర్శించాను. దిశలు విదిశలు అన్నీ నీ అనేక పాదములు, అనేక శిరస్సులు,అనేక ఉదరములు, అనేక బాహువులతో సర్వము నీవయై ఉన్న నీ ఈ విశ్వరూప సందర్శన భాగ్యంతో నా కన్నులు ధన్యమైనాయి. నా మనస్సు తృప్తి చెందింది. ధన్యోz స్మి, విశ్వరూపా! ధన్యోz స్మి. దయచేసి ఇక

ఈ విశ్వరూపాన్ని ఉపసంహరించి , నీ ఎప్పటి కళ్యాణరూపాన్ని ధరించు.
కృష్ణ - ఉదంకా! నీ భక్తి శ్లాఘనీయము. అనితరలభ్యమైన నా విశ్వరూపాన్ని దర్శించగలిగావు. ఇష్ట వరాన్ని కోరుకో. ప్రసాదిస్తాను.
ఉదం - ఓ సంశ్రితార్తి హరా! నీ విశ్వరూప సందర్శన భాగ్యాన్ని ప్రసాదించావు. ఇంకా ఇంతకంటె కోరదగిన వరం ఏముంటుంది ప్రభూ! ఇక నాకు ఏ వరాలూ వద్దు.
కృష్ణ - ఉదంకా! అలా కాదు. నా దర్శనభాగ్యం శుభం కలిగించకుండా పోదు. నీకు ఏ వరం కావాలో సందేహించకుండా అడుగు. సంతోషంగా ఇస్తాను.
ఉదం - దేవా! తప్పదు అని నీవంటే సరే విను. ఇదంతా మరుభూమి కావటం వలన నీళ్ళు దొరకటం చాలా కష్టంగా ఉన్నది. నాకు సమీపంలో జలం ఎప్పుడూ లభించేలా అనుగ్రహించు.
కృష్ణ - (తన లలిత సుదుర్దర్శ రూపమును ధరించి ) అనఘా!నీవు నన్ను ఎప్పుడు తలచుకుంటే అప్పుడెల్లా నీకు జలం లభించేలా అనుగ్రహిస్తున్నాను.

కృష్ణుడు ఉదంకుడికి వరం ఇచ్చి అతనిని వీడ్కొని అక్కడనుండి అంతర్ధానమైనాడు. తరువాత ఉదంకుడు ఒకసారి దప్పిక అయి హృషీకేశుణ్ణి తలచుకున్నాడు. వర్షం పడుతుందేమో అని చూశాడు. ఎక్కడా కనీసం మేఘాలజాడ అయినా లేదు. అలా మేఘజలంకోసం ఏకాగ్రంగా చూస్తున్న ఉదంకుడి ఏకాగ్రతకు భంగం కలిగి అతడికి కోపం వచ్చింది. దానికి కారణం? నాలుగు కుక్కలు తన కాళ్ళు నాకుతూ, తనను చుట్టుతూ వస్తుండగా ఎవడో ఛండాలుడు,ధనుర్బాణాలనుధరించినవాడు, దిసమొలవాడు, ఒడలంతా దుమ్ము కొట్టుకొని ధారలుగా చెమటలు కారిపోతూఉంటే అటువైపుగా ఉదంకుడి దృష్టిపథంలోకి రావటం. ఉదంకుడు తనవైపు చూడగానే
ఛండా - ఓ ఉదంకా! పాపం నీవు దప్పికతో చాలా బాధ పడుతున్నావు. ఇదిగో నా ఒడలిమీద అంతా చూస్తున్నావుగా. ఈ జలాన్ని నీ దాహం తీరేలా తనివితీర గ్రోలు. ఇంతకంటె అమృతం నీకిక్కడ వేరే ఎక్కడా దొరకదు.
ఉద -(వాడివైపు చూస్తూ, అసహ్యించుకుంటూ) ఛీ నేను త్రాగను.
చండా - ఉదంకా! నీవు జలంకోసం పడుతున్న అవస్థలు చూసి నీమీద జాలి కలుగుతున్నది. ఇప్పటికిదే నీ పాలిటికి అమృతం. దాహమవుతున్నా నీవు అసహ్యించుకుంటున్నావంటే నాకు ఆశ్చర్యంగా ఉంది.

-సశేషం

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**అస్తి స్వస్తరుణీ పరాక్రమ లసత్కల్ప ప్రసూనాయితం**
**వస్తు ప్రస్తుత వేణునాద లహరీ నిర్వాణ కుర్వ్యాకులమ్**
**స్రస్త స్రస్త నిరుద్ధ నీవి విలసద్గోపీ సహస్రావృతం**
**హస్తన్యస్త నతాపవర్గమఖిలోదారం కిశోరాకృతిః ॥**

ఏదైనా ఉన్నది అని చెప్పాలంటే దాని అపరోక్షానుభూతిని పొంది ఉండాలి. అప్పుడే తాను దాని ఉనికిని ఇతరులకు రూఢిగా చెప్పగలుగుతాడు. దానికంటె ఒక మెట్టు క్రింద ఉండేది ప్రత్యక్షప్రమాణము. పరమాత్మకు సంబంధించినంతవరకు స్వాత్మానుభవమే స్వతః ప్రమాణం.

ఆంజనేయుడు లంకలో సీతాదేవిని చూచి తిరిగి వచ్చి శ్రీరామచంద్రుణ్ణి దర్శించినప్పుడు మొదట ఒక్కమాటలో 'మా అమ్మ సీతమ్మను చూశాను' అని చెప్తాడు. అలా కాకుండా తాను ఎంత కష్టపడి లంకను చేరినదీ, అక్కడ ఏ ఘనకార్యాలు సాధించినదీ అన్నీ వర్ణిస్తూ కూర్చుంటే, శ్రీరామచంద్రుడి హృదయంలో ఉన్న ఉత్కంఠ ఎలా తీరుతుంది? సీత ఎక్కడ ఉన్నది? ఎలా ఉన్నది? జీవించి ఉన్నదా? వంటి సందేహాలు తీరుతాయా? అందుకే ఆంజనేయుడు 'సీతమ్మను చూశాను' అని చెప్పాడు. ఆ ఒక్కమాట మాత్రమే శ్రీరామచంద్రునికి ఉత్కంఠకు ఊరట కలిగించ గలదు. సీత జీవించి ఉన్నది, లంకలో ఉన్నది అని తెలిసేలా చేయగలదు. అలాగే శ్రీలీలా శుకులు కూడ తమ శ్రీకృష్ణ కర్ణామృతాన్ని అస్తి అని ప్రారంభించారు. అస్తి అంటే ఉన్నది అని అర్థం. ఆ ఒక్క పదం భక్తులకు పరమాత్మ ఉనికిని గురించిన సకల సందేహాలను తీర్చేదిగా ఉన్నది.

అయితే నిరాకారము, నిర్గుణము, నిర్వికల్పము, నిష్కళంకము, నిరంజనము, నామగోత్ర కుల వర్ణ దూరగము, నిరవయవము, సజాతీయ విజాతీయ స్వగత భేద రహితము అయిన ఆ పరబ్రహ్మ వస్తువు తనకన్న భిన్నముకాని తన శక్తి వలన సర్వ మంగళకరములైన గుణములు, నామములు, రూపములు, తనవిగా అయి ఎందరో సోపాధిక మూర్త్యుపాసకులకు బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తున్నది. శ్రీలీలాశుకులు ఆ పరబ్రహ్మవస్తువు అనుభూతిని తాము పొంది దానిని ఎలా వర్ణిస్తున్నారో చూడండి.

సర్వ ప్రకృతి మైమరచి పరవశించి తన మధుర వేణుగాన లహరిలో ఓలలాడేలా చేస్తూ అయినా ఆ సుఖ పారవశ్యంలో తాను నిశ్చలంగా ఉండి, వీనుల విందుగా వేణునాదం చెవులకు సోకగానే ఎక్కడివక్కడ అలాగే వదలి ఎలా ఉన్నారో అలాగే అస్తవ్యస్తమై కాళ్ళకు అడ్డుపడుతున్న కోకలతో, నీవీ బంధమువిడి వీపుపై జీరాడుతున్న శ్రోణీభరముతో ఆ వెన్నెల రాత్రిలో పరిగెత్తుకొని వచ్చి తమ లక్ష్యస్వరూపమైన తనను పరివేష్ఠించిన గోపకన్యలతో, ఆకాశవీధిలో దేవకన్యలు తమ దోసిళ్ళలో నింపుకున్న పారిజాత కుసుమాలతో పుష్పవృష్టి కురిపిస్తూ ఉంటే తనను శరణాగతి పొందినవారికి ప్రసాదించటానికి అరచేతిలో మోక్షాన్ని సిద్ధంగా ఉంచుకున్న బాలకిశోర రూపంలో ఆ పరమాత్మ వస్తువు ఉన్నది.

అది తాను కదలకుండానే తన వేణుగానరాగడోలల ప్రణవనాదంతో జగత్తునంతటిని కదలిస్తున్నది. తమప్రాణనాధుని చెంతకు చేరటానికి అన్నిటినీ చివరకు దేహాభిమానము సైతము వదలి తమ లక్ష్యమైన ఆ స్వామిని చేరి ఆ స్వామి  పాదాలను పరివేష్టించి ఉన్న ఆ వ్రజ భామినులు పొందుతున్న ఆనందం వారిభాగ్యము తమకు కలగలేదే అన్న అంతరంగంలోని ఆవేదన చల్లారటంకోసం ఆరాధనా భావంతో తమ దోసిళ్ళనిండా నింపుకున్న నందనవనకల్పతరుపారిజాత ప్రసూనాలతో ఆ గోపకిశోరుణ్ణి దేవకన్యలు అభిషేకిస్తున్నారు. మరి ఆశ్రయించాలే కాని శరణన్నవారిని వదిలిపెడతానా! నా పురుషోత్తమపదమైన మోక్షపదాన్నే వారికి ప్రసాదించడానికి సిద్ధంగా ఉన్నాను అని అలనాడు తన భక్తుడైన ప్రహ్లాదుని మాటలను వమ్ము చేయటానికి ఇష్టంలేక ఎప్పుడు హిరణ్యకశిపుడు ఎక్కడ ఏ రూపంలో చూపించమంటాడో అని అన్నింటిలో, సర్వేసర్వత్రా, అన్ని రూపాలతో, చివరకు ఒక స్తంభంలో నరమృగ రూపంలో సహితము దాగుకొని ఉండి తన భక్త పరాధీనతను ఋజువు చేసుకున్న ఆ మోక్షప్రదాత ఆనంద నిలయుడు అయిన ఆ పరబ్రహ్మ వస్తువు బాలకిశోరము రూపంతో  అపవర్గమును అంటే మోక్షమును తన అరచేతిలో సిద్ధంగా ఉంచుకొని అభయవరద హస్తాలతో భక్తులను అనుగ్రహిస్తున్నది అంటూ శ్రీలీలాశుకులు తాము దర్శించిన పరబ్రహ్మ వస్తువును వర్ణిస్తున్నారు.

-సశేషం

# మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

మార్చి 27 నుండి ఏప్రియల్ 2వ తేది వరకు శ్రీకాళీవనాశ్రమంలో మౌన ధ్యాన సప్తాహ శిబిరం నిర్వహింపబడింది. ఈ శిబిరంలో శ్రీమాతాజీ వారు చేసిన అనుగ్రహభాషణలను సంగ్రహంగా ప్రచురిస్తున్నాము-ఎడిటర్

**ఖేలతి బ్రహాండే భగవాన్ ఖేలతి పిండాండే భగవాన్,(గురుభగవాన్)**

శ్రీ గురుదేవులు ఈ కీర్తనను కొన్ని గంటలు పాడించుకొని ఆనందిస్తుండేవారు. ఇప్పుడు 20 నిముషాలలో పాడుకొన్నా. ఒకరుపాడితే తత్తిమావాళ్ళు వింటారు.వారు పాడకపోయినా వాళ్ళ మనస్సు పాడుతుంది. మన గురుదేవులకు ఇష్టమైన పాట అయితే మనకు అర్థం తెలియకపోయినా మనం అందులోని ఆస్వాదనను అనుభవిస్తాం. ఇక్కడ(బృందావనం) నీ సన్నిధిలో నిన్ను తలుచుకుంటూ, నువ్వు పాడించుకుని ఆనందించిన పాట పాడుకుంటున్నానయ్యా.

శ్రీ సదాశివ బ్రహ్మేంద్రులు జ్ఞాని. బ్రహాండే ఖేలతి. బృహత్-ఇతి బ్రహ్మ. ఆ బ్రహాండంలో శ్రీసదాశివ బ్రహ్మేంద్రులు ఆడుకుంటున్నారు. పిండాండే ఖేలతి. పిండాండంతో ఆడుకుంటున్నాడు. చెప్పుకోవటానికే పిండాండం. కాని ఉన్నది బ్రహాండంలోనే. మనంకూడా ఈ జగత్తు అనే మ్యూజియంలో, రకరకాల మనస్తత్వాలతో ఉండి భగవంతుని పొందాలని ఇక్కడికి వచ్చికూడా దాని చుట్టూ తిరుగుతున్నాం. పరిగెత్తే మనస్సును తిరిగి, తిరిగి నిర్దేశింపబడిన మంత్రంపై నిలుపుతున్నాం. కాని గురుకృప లేకుండా రామ దర్శనం ఎలా అవుతుంది? దక్షిణామూర్తి తానే ఆరాధ్య దైవం అవుతున్నారు. ఆయన మౌనంగా ఉంటే, బయట కదలికలు అవుతున్నాయి. చుట్టూ ఉన్న శిష్యులకు ఆయన మౌనం ద్వారానే తత్త్వబోధ దొరికింది. వారికి ఆ బోధస్మృతిచేత కలిగిన స్థితి ఎలాంటిది? పరమా త్మాzహం, పరిపూర్ణోz హం, బ్రహ్మైవాహమహం బ్రహ్మేతి... అనే స్థితి.

పరమాత్మను తానే. పరిపూర్ణ రూపం తానే. మనస్సులో దేశ, కాల, పరిస్థితులలో ఆలోచించావేమో గమ్యానికి దూరమవుతున్నావు. ఎవరైనా పోతే ఎక్కడ చూస్తున్నావు? రెండు చేతులూ ఎత్తి పైన చూపిస్తున్నావు.

మనస్సు ఎలా సంచరిస్తే ఏం? నువ్వు మనస్సుతో వెళ్ళకు. మనస్సు

ఎటో పోతోంది అని నువ్వే చెపుతున్నావు. నీకే తెలుస్తోంది.మనస్సు చలిస్తే చలించుగాక. అది గుర్తించి దాని వెంట పడకపోతే చాలు. మనస్సు తోక ముడుస్తుంది. ఇదే ధ్యానం అంటే.

**మనసా ఎటులోర్తునే** అనే త్యాగరాజ స్వామి వారి కీర్తన నాకు సాధనలో ఉపయోగపడింది.ఈ పాట ఎవరిగురించో పాడినది కాదు.వారు తన మనస్సు గురించి పాడి మనకి అందించారు. తల్లి తన బిడ్డకు ఆహారం అందిస్తుంది. కానిపెద్ద అయ్యాక కాదు. కాని మన గురుదేవుల వద్ద మనం ఎప్పుడూ బిడ్డలమే.వారి కృపా దృష్టి మనపైన ఎప్పుడూ ఉంటుంది. అదీ గురుస్థానం అంటే. వారు ఎప్పుడూ 'ఎంకరేజ్‌మెంట్' ఇస్తూనే ఉంటారు.తన బిడ్డలు ఎప్పుడూ పైకి రావాలనే వారి ఆకాంక్ష. వారి దగ్గర దాచుకోవటం అనేది లేదు. మర్మం అసలే లేదు.అట్టి సమర్థులైన గురుదేవులు వారు. కాకపోతే మనం గుర్తించలేకపోతున్నామన్నదే వారి బాధ, "నీది తెలియని బాధ నాది తెలిసిన బాధ'' అనేవారు శ్రీ గురుదేవులు. వారి అనుగ్రహం పరిపూర్ణంగా పొందితే, నువ్వు అదే అయిపోతావు. ఆయన ఎంత చెప్పారో, ఎంత అందించారో! విశ్వాసం పూర్తిగా ఉంటేనే గుర్తింపు. లేకపోతే ఏ విద్యా అబ్బదు.

దినకరకులభూషణుని దీనుడవై భజన చేసి,
దినము గడుపుమనిన నీవు వినవదేల గుణవిహీన ।మనసా ఎటులోర్తునే।

ఆయన సూర్య వంశ సంజాతుడు.గుణాలను ప్రకాశింపచేసేవాడు. ఆ రాముడిని మనకు చూపించిందిఎవరు? మన గురుదేవులే! వారి నీడలో మనం బ్రతుకుతున్నాం. వారు చెప్పింది నం ఆచరించకపోతే జీవితం చిక్కులలో పడుతుంది. మన జీవితం ఎంతవరకో మనకే తెలియదు. మన కర్మలను రహితం చేసి తరింపచేయటానికి వారు మనను దగ్గరకు చేర్చుకొన్నారు.

గురుదేవులు " అమ్మడూ! నేను ఎక్కడికైనా వెళ్ళి మౌనంగా ఉంటాను'' అనేవారు. అందుకే నేను ప్రతి గురువారం మౌనవ్రతం పెట్టుకొన్నాను. దీనికి కారణభూతులు ఒక మహాత్ములు. వారు శ్రీ గురుదేవుల పుణ్య ఆరాధనకు వచ్చి ". అమ్మా! మీరు నాకు ఒక మాట ఇవ్వాలి.'' అన్నారు. నేను "ఏమిటి స్వామీ?''అన్నాను."మౌనంగాఉంటాను అని మాట ఇవ్వాలి. ఎన్ని రోజులు అనేది మీకు వదిలేస్తున్నాను'' అన్నారు.

"సరే ఒక రోజు ఇస్తాను స్వామీ" అన్నాను. గురుదేవులు కాబట్టి గురువారం నాడు మౌనవ్రతం పెట్టుకున్నాను. అప్పటినుంచీ రోజులు భగవత్పరంగా గడిచిపోతున్నాయి. కాని కార్యక్రమాలకు వెళ్ళినప్పుడు ఇది ఒక పెద్ద పరీక్ష అవుతోంది. అప్పుడు నేను గురుదేవులను ప్రార్థించుకుంటాను. " పరీక్ష పెడతే పెట్టవయ్యా! ఎలాగూ నువ్వే కదా చూసుకొనేది" అని. మార్చిలో జలగాంలో శ్రీ సద్గురుదేవులు,శ్రీ ఆంజనేయస్వామి,శ్రీవిఘ్నేశ్వరస్వామి - త్రిమూర్తుల ప్రతిష్ఠ జరిగినదీ గురువారం నాడే. ప్రతిష్ఠతో పాటు,ఎన్నో కార్యక్రమాలు జరిగాయి, శ్రీ గురుదేవులే చూసుకున్నారు.

పనులన్నీ త్వరగా ముగించుకొని ఇక్కడ (బృందావనంలో) కూర్చుంటే తృప్తి కలుగుతోందా లేదా? ఇదే శ్రీత్యాగరాజస్వామివారు చెబుతున్నది. **...**దినము గడుపుమనిన నీవు వినవదేల గుణవిహీన. తాళం నీ దగ్గరే ఉంది. ఇటు వేస్తే బృందావనం. అటువేస్తే ప్రపంచం. "నా మనస్సు నిలవలేదు" అంటారు. ఇక్కడ ఉన్నప్పుడు హంస వెళ్ళిపోతే ఇంకా ఏం కావాలి? నువ్వు దేహాన్ని దాటితే బృందావనం నువ్వే అయ్యావు.

కలిలో రాజస తామస గుణములు కలవారి చెలిమి చేయుచు
కాలము గడుపగనేల? సులభముగా కడదేర్చెడు
సూచనలను దెలియజేయు, ఇలను త్యాగరాజుమాట
వినవదేల గుణవిహీన ।మనసా ఎటులోర్తునే।

ఇంగువ గుడ్డ ఇంగువ వాసన వస్తుంది.ఉల్లిపాయ కడితే ఆ వాసనే వస్తుంది. అదే ఇబ్బంది పెడుతోంది. రాజస, తామస గుణములు కలవారితో కాలం గడిపేస్తోంది, ఆశ దానికి కారణం అవుతోంది. దీనికి దృష్టాంతంగా కోతులను పట్టేవాడు వేసిన పప్పుల ప్రలోభంలో పడి కోతి ఆశ వల్ల అతడికి చిక్కుతుంది.

సంఘంలో పనులు చేయవచ్చు.దానికన్నా ఆత్మ ధర్మం గొప్పది. నీ మనస్సును ఎలా నడుపుతావో, ఆ ఛాన్స్ నీకే ఇచ్చాడు భగవంతుడు. రాజసాన్ని త్యాగం చేశాడు శ్రీత్యాగరాజస్వామి. "చెప్పింది విని ఆచరించండి. లబ్ధిని పొందుతారు" అన్నారు శ్రీ గురుదేవులు.

శ్వాస పీల్చినప్పుడు మాట్లాడలేవు. శ్వాస విడిచినప్పుడే మాట్లాడతావు. అలా శ్వాస తీసికొని విడిచేటప్పుడు ప్రణవ స్వరూపమైన **హంస స్సోహం, హంసస్సోహం సోహమేవేతి.** అనే సూచన మంత్రాన్ని అనుష్ఠానంచెయ్యి.

ఆయన బ్రహ్మ, రుద్ర, విష్ణువులతో ఆడుకుంటున్నాడు. అలాగే పిండాండంతో ఆడుకుంటున్నాడు. త్వక్,చక్షు,శ్రోత్ర,ఘ్రాణ,రసములు జ్ఞానేంద్రియములు -5 ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు 5. ఈ వాయువులు ఎలా పని చేస్తున్నాయి? ఎలా అమర్చాడు భగవంతుడు? డాక్టర్లు ఎమర్జెన్సీ వస్తే ఆక్సిజన్ పెడతారు. సెలైన్ ఎక్కిస్తారు. బెడ్‌ప్యాన్లు పెడతారు. ఎవరు చేయాల్సిన పని వారు చేసికొంటూ పోతారు. అయినా వారు చావును ఆపగలరా? అసలు చావకుండా ఉండాలి అంటే భగవంతుడి అనుగ్రహం ఉండాలి. ఇన్ని విధాలుగా ఉంటూ అయన హాయిగా ఆడుకుంటున్నాడు.

శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలనే తన్మాత్రలు - వాటిని జ్ఞానేంద్రియాలు గ్రహిస్తే కర్మేంద్రియాలు పని చేస్తున్నాయి. దీనినే పంచీకరణం అంటారు.

రాజస, తామస, చిత్తే - ఖేలతి బ్రహ్మండే - మనస్సు ఎటు వెళ్ళినా వాడు ఆడుతూనేఉన్నాడు. ఆ ఆడుకొని బ్రహ్మ పరమహంసరూపంతో విహరిస్తున్నాడు. మనకు సుఖ ,సంతోషాలు ఏవి కలిగినా గురుదేవుల అనుగ్రహం వలననే కదా.ఆ గురుదేవులముందు సుఖ ప్రారబ్ధ గ్రహచార బండిని పడేసి మనను గమ్యస్థానానికి చేర్చాలని చూస్తున్నారు. ఎవరు? నువ్వు ఎవరనుకుంటే వాడే. నువ్వు ఆశ్రయించినవాడు - రాముడు, కృష్ణుడు, లేక గురుదేవులు.

శ్వాస సః అని తీసికొంటోంది. హం అని వదిలేస్తోంది. వివేక దృష్టి కలిగితే వైరాగ్యం సిద్ధిస్తుంది. ఇటువంటి సాధనను శ్రీ గురుదేవులు మనకు తేలికగా,అలవోకగా ప్రసాదిస్తున్నారు. ఇది(దేహం) విడిచేలోపల విడవరానిది ఒకటి ఉన్నదని గుర్తించే గుర్తింపే నిజమైన సాధన. కనుక అటువంటి శక్తిని, భక్తిని, సాధనా సంపత్తిని శ్రీగురుదేవులు మనందరికీ ప్రసాదించెదరు గాక సుఖీభవ! సుఖీభవ!!

# శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమము, హైదరాబాద్ సత్సంగ సమావేశములు

-నివేదిక

ఆత్మ వస్తువు స్వయంసిద్ధమైనది. అందరిలో అందరిగా ఉన్న ఆ ఆత్మవస్తువు కొత్తగా పొందబడేది కాదు. విచారణ ద్వార దాని అనుభూతిని ఆనందించాలి.మనం మౌనం వహిస్తే అప్పుడు మనలో ఉన్న భగవంతుడు మాట్లాడతాడు. అప్పుడు మనం సాక్షులుగా అయితే కేవలం వాటిని వింటూ ఆనందించాలి.

ఉత్తమ గురువు లభించినప్పుడు మనం వారివద్ద సరిగా నడచుకోవాలి. లేకపోతే మనకి మానవజన్మ వచ్చి ఆ సదవకాశాన్ని పోగొట్టు కొన్న వారమవుతాము . అదృష్టం ఒకసారే తలుపు తడుతుంది. మాటి మాటికీ మావజన్మ వస్తుందన్న గ్యారంటీ లేదు. ఒకవేళ మానవజన్మ లభించినా సద్గురు దేవులను ఆశ్రయించగలము అన్న గ్యారంటీ అంతకన్నా లేదు. అయినా అప్పుడుకూడ సద్గురుదేవులు తమ నిర్హేతుకజాయమానమైన కరుణతో మనను తమ ఒడిలోకి ఆహ్వానిస్తూ ఉంటారు.

శ్రీరమణమహర్షి వద్ద పెరుమాళ్ అనే అతను శిష్యుడిగా చేరటానికి వచ్చాడు. ఒక అనాధగా ఆశ్రమ ప్రవేశం చేసిన అతడికి శ్రీ రమణులు వంటఇల్లు చూసుకొనే బాధ్యత అప్పజెప్పారు. కొద్దికాలంలోనే పెరుమాళ్ రమణ మహర్షికి ఏమీ చేతగాదనీ, ఆయన ఏమీ పట్టించుకోరని, తన వలననే ఆశ్రమానికి ధన సహాయం, వస్తు సంబరాలు అన్నీ సమకూరుతున్నాయి అని అని అహంకరించి, శ్రీరమణులకు క్రమంగా వంటఇంట్లో కూరలు తరగటం, పిండిరుబ్బటంవంటి పనులు పురమాయించటమే కాక, వారు ఎక్కడ కూర్చోవాలి? ఎవరికి దర్శనం ఇవ్వాలి? - మొదలైన విషయాలలోకూడ పెత్తనం చెలాయించటం దాక వస్తాడు. అయినా శ్రీ రమణులు ఎంతో కరుణా స్వభావంతో అన్నిటికీ సద్దుకొని పోతుంటారు. చివరకు ఆశ్రమాన్ని తన పేర వ్రాయమని శ్రీరమణులను నానా చిత్రహింసలు పెట్టే స్థితికి దిగజారతాడు. అది అతినికి శ్రేయోదాయకం కాదు కనుక శ్రీ రమణులు అలా చేయరు. ఆస్థితిలో అతడు కోర్టుకెక్కుతాడు. శ్రీ రమణులు కోర్టుకు హాజరుకారు. కాని కొందరు ఎంతో పేరు ప్రతిష్ఠలు గల న్యాయవాదుల మూలంగా శ్రీ రమణులను ఆశ్రమంలోనే విచారణ చేశారు. శ్రీ రమణులు

చెప్పిన సమాధానాలు, వారు ఆత్మానుభూతి పొందిన అనుభవజ్ఞానులని, ప్రపంచ పరమైన వ్యవహారాలకు అతీతులుగా ఉండేవారని తెలుపకనే తెలిపేవిగా ఉంటాయి. పెరుమాళ్ళు కేసులో ఓడిపోతాడు. తను చెప్పిన ప్రశ్నలను రమణమహర్షిని అడగలేదని వకీలుని తిట్టి వేరే వకీలును పెట్టుకొని హైకోర్టుకు అప్పీలు చేశాడు. కాని పెరుమాళ్ళు అక్కడకూడా చిత్తుగా ఓడిపోతాడు. అతడికి బుద్ధి వస్తుంది. శ్రీ రమణమహర్షి వద్దకు వచ్చి నమస్కరించి, తాను చేసిన అన్యాయాలకు, అపచారాలకు తనకు నరకం తప్పదు అని ఏడుస్తాడు. శ్రీ రమణ మహర్షి ఎంతో కరుణార్ద్ర దృష్టితోఅతడిని చూస్తూ, "నాయనా! పెరుమాళ్! నీకు విచారం ఎందుకు? అక్కడకూడ నేను నీకోసం ఎదురు చూస్తాను. అక్కడకూడ నేను నీకు తోడుగా ఉంటాను. నీకు భయపడవలసిన అవసరం ఏమున్నది?'' అంటారు. గురుకృప ఎంత విశాలమైనదో ఎవరు చెప్పగలరు? అది అనంతం.

గురుదేవుల ఆజ్ఞను తు.చ తప్పక పాటిస్తే గురుకృప కలుగుతుంది గురుకృప లభిస్తే అన్నీ లభించినట్లే. 'థర్టీ సిక్స్(36) చేంబర్స్ ఆఫ్ షావోలిన్' అని ఒక సినిమా వచ్చింది. అందులో ఒక యువకుడు మార్షల్ ఆర్ట్స్ నేర్పే ఒక గురువు ప్రఖ్యాతిని విని ఆయన వద్ద శిష్యునిగా చేరటానికి వస్తాడు. గురువు వెంటనే అతడిని శిష్యునిగా అంగీకరించక ముందు అక్కడ ఉన్న భవనంలోని 36 గదులకు పెయింట్ వేస్తే తరువాత అతడి శిష్యరికం గురించి ఆలోచిస్తానంటాడు. ఆ వచ్చిన అతడు మారు మాటాడకుండా పెయింట్‌ను, బ్రష్‌ను పట్టుకొని వెళ్ళి పెయింట్ వెయ్యటానికి ఉపక్రమిస్తాడు. గురువు ఆజ్ఞను తు.చ తప్పక ఆచరిస్తున్న అతడికి గురుకృప వలన పెయింటింగ్ వేస్తుంటే ఒక్కొక్క గదిలో ఒక్కొక్క మల్లయుద్ధవిద్యకు సంబంధించిన రహస్యాలన్నీ తెలిసి, వాటిలో అతడికి ప్రావీణ్యం కలుగుతుంది. అతడు అన్ని గదులకు పెయింటింగ్ వెయ్యటం పూర్తి చేసి, అన్ని రకాల మల్లయుద్ధ రహస్యాలలో ప్రవీణుడై గురువు దగ్గర శిష్యునిగా చేరటానికి వస్తాడు. అంతలో ఒక మల్లయుద్ధ వీరుడు అక్కడకు వచ్చి గురువుతో అక్కడ ఉన్న వారిలోఎవరైనా తనతో పోరాడి గెలవండి,లేదా ఓటమిని అంగీకరించవలసింది అనిఛాలెంజ్‌చేస్తాడు

-సశేషం

# మాతాజీ బోధామృతం

- శివ ప్రసాద్

బ్రహ్మము అన్నిటిలో ఉన్నాడు. ఆ భగవంతుడు మనలో ఎక్కడ ఉన్నాడు? ఏం చేస్తున్నాడు? సదాశివ బ్రహ్మేంద్రులవారు ఆనందంగా పాడుకున్నారు---

ఖేలతి మమ హృదయే రామః ఖేలతి మమ హృదయే
మోహ మహార్ణవ తారక హారీ రాగద్వేష ముఖాసుర మారీ॥ ఖే ॥
శాంతి విదేహసుతా సహచారీ దహరా z యోధ్యా నగర విహారీ॥ ఖే ॥
పరమహంస సామ్రాజ్యోద్ధారీ సత్యజ్ఞానానంద శరీరీ॥ ఖే ॥

భగవంతుడు మన హృదయంలోనే ఉన్నాడు. మన గురుదేవులు కూడ మన హృదయంమీద ముద్రవేశారు, నేను మీ హృదయబాబును అని. గురుదేవులు మన హృదయంలోనే ఉండి అనుక్షణము మనతో రమిస్తున్నారు.

అయినా మానవుడు అది గుర్తించడు. అతడి మనస్సు ఎప్పుడూ స్థిరంగా ఉండదు.

నిలకడేలేని మనసా ఎందాక నీ పయనం?
నిన్ను నీవే నమ్మవు నీవెవరిని నమ్మగలవు?
కాలమనే మార్గాన కోరికల గుఱ్ఱాలెక్కి
ఎక్కడికో వెళ్ళాలంటూ ఏమేమో చేయాలంటూ
ఆరాటపడతావేల? ఆ రాట పడతావేల?
ఆ కాలమే ఎదురైతే చతికిలపడి వగచేవేల?
నిన్నటి జ్ఞాపకాలతో రేపటి వ్యాపకాలతో
నేటి సంగతినే మరచి సతమతమౌతావేల?
నేడు చేజారిపోతే గుండెపగుల ఏడ్చేవేల?
ఏకాగ్రత లేని మనసా గాలిలో దీపం నీవు
ఆరాటం నిండిన మనసా పడిలేచే కెరటం నీవు
ఈ నిజాన్ని తెలుసుకొని నీ నడవడి మార్చుకొని
గురునామ స్మరణే చేస్తూ నీ గమ్యం చేరుకో॥

ఈ పాట గురుదేవులు మననుగురించే చెప్పారు. మన మనస్సు తనను తానే నమ్మదు ఇక గురుదేవులపైన ఎటువంటి నమ్మకం ఉంటుంది? అది ఏవేవో ఆలోచనలు చేస్తుంది. ఎక్కడెక్కడికో పరుగులు తీస్తుంది.

అటువంటి మనస్సు నిలబడాలి అంటే గురుదేవుల పాదపద్మాలను ఆశ్రయించటం ఒక్కటే మార్గం.

శ్రీగురుదేవులు మా గురుసోదరులైన డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్‌గారితో శ్రీవిజయేశ్వరానంద ప్రసాద్‌గారితో నారాయణోపనిషత్తు, భగవద్గీత ఇలా ఎన్నెన్నో చెప్పించేవారు. ఎప్పుడైనా వారు స్వంతంగా ఏదైనా వ్యాఖ్యానం చేస్తుంటే వారిని అక్కడ ఉన్నది ఉన్నట్లు చెప్పమనేవారు. సరైన అర్థం చెప్పేదాక వారితో దాని అర్థం చెప్పిస్తూనే ఉండేవారు.

ఒకసారి గురుదేవులు సభలో వారితో అర్థాలు చెప్పిస్తూ వారిద్దరినీ ఇసుక తక్కెడ, పేడ తక్కెడ అన్నారు. సభలో ఎందరో బాబూజీ అలా అనటం విని ఆశ్చర్యపోయారు. వారిద్దరంటే అసూయాగ్రస్తులైన ఎవరో కొద్దిమంది మాత్రం హమ్మయ్య ఇన్నాళ్ళకు గురుదేవులు వాళ్ళకు ఇలాంటి పేర్లు పెట్టారుకదా అనుకున్నారు. దానితో వాళ్ళ కళ్ళు చల్లబడ్డాయి. గురుదేవులు మళ్ళీ మాట్లాడుతూ, ఇసుక తక్కెడ, పేడ తక్కెడ గురించి రేపు చెప్తాను, రేపు సత్సంగం చాలా సేపు చేసుకుంటాము, అందరూ బాగా టిఫిన్ తిని మరీ రండి అని చెప్పారు.

మరునాడు శ్రీ గురుదేవులు సభలో ఇసుక తక్కెడ, పేడ తక్కెడలను గురించి చెబుతూ ఒక పెద్ద ఇసుక గుట్టలో ఒక చిన్న పంచదార కణం ఉంటే చీమ దానిని గ్రహించి వెతికి తెచ్చుకుంటుందని, తారకం అలా అనంతమైన శాస్త్రాలలో దాగి ఉన్న బ్రహ్మ పదార్థాన్ని ఆ చీమలా పట్టుకుంటాడు గనుక తారకాన్ని ఇసుక తక్కెడ అన్నానని, ఆవుపేడను అగ్నికి దగ్ధం చేస్తే అది విభూతిగా అవుతుందని, పరమశివుడు ఆ విభూతిని ధరిస్తాడని అలాగే భక్తులు ఆ విభూతిని నొసట ధరిస్తారని, అటువంటి భక్తులు కనుక వెంకటరత్నాన్ని పేడతక్కెడ అన్నానని వివరించారు. అప్పుడు కాని అందరికీ అర్థం కాలేదు, గురుదేవులు అన్న ఇసుక తక్కెడ, పేడ తక్కెడ అంటే ఏమిటో. గురుదేవులు ఒకమాట అంటే దానికి ఎన్నో మహార్థాలు ఉంటాయి.

చివరి రోజున సత్సంగ కార్యక్రమంలో శ్రీ మాతాజీ మాట్లాడుతూ శ్రీ గురుదేవులు మన తపన ఎంత తపస్సుగా మారుతుందని చూస్తారు అన్నారు. ఆ రోజు సూర్యగ్రహణాన్ని గురించి ప్రస్తావిస్తూ అది పాక్షిక గ్రహణం మాత్రమేనని అన్నారు. ఎవరికైనా గ్రహణం పట్టింది అని అంటే వారి జీవితం భయంకరంగా గడవటం, ఏ పనులూ సరిగ్గా జరగకపోవటం వంటివి

ఉంటాయి అని అర్థం. మనజీవితంలో కూడ అంతే. విషయాదులు అనే గ్రహాలు పట్టినప్పుడు మన నిగ్రహం దెబ్బతింటుంది. సాధన ముందుకు సాగదు. మన నిగ్రహం దెబ్బ తినకుండా ఉండాలి అంటే గురుదేవుల అనుగ్రహం ఎప్పుడూ ఉండాలి. గురుదేవుల అనుగ్రహం ఎప్పుడూ ఉన్నది. మనం వారిని గుర్తించి నంత వరకు మనను ఏ గ్రహమూ పట్టుకోవటానికి వీలులేదు. గురుదేవులు దానికి ఎన్నో నిదర్శనాలు కూడా చూపించారు. అమావాశ్యనాడు గ్రహణం పడితే ఆ గ్రహాలను వదలించుకోవాలనేకదా అనుకుంటున్నారు, అందుకని ఆ గ్రహణ సమయంలోనే ధ్యానం చేయండి అని ధ్యానం చేయించేవారు. నిశాచరులను వదలించుకోవాలనేకదా మీరు కోరుకునేది, అందుకని రాత్రి 12 గం॥లకు లేకపోతే అర్ధరాత్రి ఎప్పుడు మెలకువ వస్తే అప్పుడే ధ్యానం చేసుకోండి అని చెప్పేవారు.

పాము మంత్రము, తేలు మంత్రము మొదలైన మంత్రాలు నేర్చుకున్నవారు కూడ గ్రహణ సమయంలో ఆ మంత్రాన్ని ధ్యానిస్తారు. గ్రహణ సమయంలో ధ్యానం చేసినందువలన ఆ మంత్రాలకు ఎంతో శక్తి వస్తుంది. ఆ మంత్రాల సంగతే అలా ఉంటే, ఇక గురుదేవులు స్వయంగా ప్రసాదించిన మంత్రాన్ని గ్రహణ సమయంలో ధ్యానం చేస్తే అది ఇంకా ఎంత శక్తి వంతంగా ఉంటుంది? అది ఇంకా ఎటువంటి ఉత్తమ ఫలాలను ప్రసాదిస్తుంది? అందువలన గ్రహణ సమయంలో అందరూ ధ్యానం చేసుకోవాలి అని, లక్ష్యార్థాన్ని తీసుకున్నవారు గ్రహణ సమయం పూర్తి అయ్యేదాక తప్పక ఆ లక్ష్యార్థాన్ని ధ్యానించాలని వివరించి అందరితో ధ్యానం చేయించారు. *

ప్రశ్న-ప్రార్థన వలన ఏమైనను ప్రయోజనము కలదా?
జవాబు - లేకేమి! తప్పక కలదు.ప్రార్థించునప్పుడు మనస్సును, వాక్కును ఏకీభవించునెడల భగవంతుడట్టి ప్రార్థననాలకించి సఫలము చేయును. ఊరక నోటితో, " ప్రభూ! ఈ సకలము నీదియే " అని పలుకుచు, అంతరంగమున అన్నియు తనవేయని భావించు నరుని ప్రార్థనలు నిరర్థకములు.

-శ్రీరామకృష్ణబోధామృతమునుండి

# మాతాజీ సత్సంగ్ డైరీ

-రమణ ప్రసాద్

(ఏప్రిల్17నుండి19 వరకు విజయవాడలోజరిగిన సత్సంగ కార్యక్రమాలలో 17వతేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధమును** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

ఈ ప్రశాంత వాతావరణంలో, బ్రాహ్మీముహూర్తంలో సాధన అనే పరికరాన్ని శ్రీ గురుదేవులు మనకు అందించారు. రానివారి కోసం చూడకండి. ఆకలి లేకపోతే భోజనం చేయలేరు. అలాగే దీనికి(మనస్సుకు) ఆకలిలేకపోతే ఇక్కడకు రాలేరు. వంకలు పెట్టి తప్పుకుంటారు. సాధన లేకుండా మనకు ప్రపంచంలో కూడ ఏదీ రావటంలేదు. సాధన అనేది విషయంకాదు. ఎందుకంటే విషయంలో విషం ఉంది కాని సాధనలో సత్యం అనే ధనం నిక్షిప్తం అయి ఉన్నది. రాత్రి అందరూ పడుకుంటే ఆ సమయంలో మహాత్ములు ఆనందంలో ఓలలాడుతూ ఉంటారు. మనం స్వామివారిని చూశాము. వారు అర్ధరాత్రి అందరూ నిద్రపోతూఉంటే తాము ఆనందంలో ఓలలాడుతూ, బయటకు వచ్చి మనకు ఎన్నింటినో అందించారు. కాని మనం ఎన్ని అందుకున్నాము? అందుకుంటే సొమ్ము. అందుకోకపోతే దుమ్ము.

అసలు మహాత్ములు దొరకటమే దుర్లభం. మనకు మహాత్ముల దగ్గరకు ఎలా చేరాలో తెలియదు. వారి దగ్గర ఎలా నడచుకోవాలో, వారిని ఎలా సేవించుకోవాలో తెలియదు. మనం సంసారంలో ఉన్నా, సంసారం ఏమైనాకానీ, బాబూ సర్వమూ నీవే అనుకుంటే చాలు, ఆయనే, మన సంసారం కూడ ఏమీ కాకుండా మనను తన దగ్గరకు చేర్చుకున్నారు. కష్టపడకుండా ఏదీ చేతికి రావటంలేదు. ఈ ఇంటివారు ఇంత కష్టపడ్డారు కనుకనే, మనం దీనిని ఇంత అందంగా చూస్తున్నాము. కాని ఇవన్నీ బాహ్యామైనవి. బాహ్యసాధనలలో పూజ కూడ ఒకటి. అది బాహ్యపూజ. అలాగే విశేషపూజ మానసికమైనది. దానికి ఖర్చులేదు. బాహ్యామైన పూలు మొదలైనవి కూడ అక్కర్లేదు. మనం రాత్రి ఒంటిగంట దాక మేలుకోమన్నా మేలుకుంటాము, కాని తెల్లవారుఝామున 4 గం॥లకు లేవమంటే మాత్రం లేవం. పాపం పక్షులు కూడ ఇంకా లేవలేదు. అందువలననే గోలలేదు. ఇంకా ఈ హృదయంలో పక్షికూడ లేవలేదు.

ఏ సమయం మనదో ఏది మనదికాదో తెలియదు. తెల్లవారుజామున నిద్రలో ఉండగానే పోకూడదా. ఇంటర్ నేషనల్ ఫ్లైట్లు అన్నీ తెల్లవారుజామునే ఉంటాయి. మనలో కూడ ఒక ఇంటర్ నేషనల్ ఉంది. అదే మన మనస్సు. కన్నుమూసి తెరిచేలోపల అమెరికా, రష్యా అన్నీ చుట్టిరాగలదు. దానికి బాహ్య విషయాలను ఆనందించటం అంటేనే ఇష్టం. బాహ్యాన్ని ఆనందిస్తున్నా, కనీసం మన మనస్సు దానినైనా పూర్తిగా ఆస్వాదించ గలదా? తెల్లవారు జామే అయినా, బాహ్యవిషయాలే అయినా మనస్సు ఎక్కడెక్కడికో పోతుంది.

స్వామివారు ఒక తెల్లవారు జామున బోధ చేస్తుంటే ఒకామె ముందు కూర్చున్నది. కాని కూర్చున్నామె ఊరికే కూర్చోక తుంగచాపను గిల్లుతున్నది. బాబూజీ అమెతో అన్నారు "ఇప్పుడు నీవు నీ మనస్సు ఆ తుంగచాప మీద లేదు అనవచ్చు. కాని ఒకసారి చేయి అక్కడికి పోయిన తర్వాత మనస్సు తప్పక అక్కడికి పోతుంది. అంతే కాదు ఇంకా ఎక్కడెక్కడికో పోతుంది.''

ధ్యానంలో విచారణలో కూర్చుంటే మనకు ముందు కొన్ని కొన్ని అడ్డు వస్తాయి. తత్త్వ విచారణ మనకు భిన్నంకాదు. సాధన మనకన్న భిన్నంకాదు. మనం దానిలోనే ఉన్నాము. కాని మనస్సు దానిని రికగ్నైజ్ (Recognise) చేసినప్పుడే అది ధ్యానం అవుతుంది.

అలా అంతటా ఆవరించి అఖండంగా ఉన్న సృష్టిని గురించి తెలుసుకొనటం కష్టం కనుక, మహాత్ములు మనకు జీవసృష్టిని చూపించారు. చూపించి అది ఎంత శాశ్వతమో చూడు అన్నారు. గుడిలో, ధ్యానంలో, సత్సంగంలో అన్ని గంటలు కూర్చొనేవారి శరీరంలో తప్పక మార్పు వస్తుంది. కాని ముందు వచ్చే అడ్డంకులను నిరోధించటానికి కావలసింది పట్టుదల. ఆ పట్టుదలమూలకంగానే మనం 3గంటలకు లేచాము. అదే పట్టుదల లేకపోతే ఇంకో పావుగంట అంటాము. అది ఆరున్నర ఎందుకుకాగూడదు అంటుంది పట్టుదలలేని మనస్సు.

నిజ జాగ్రత్తలో ఉండు అనేవారు గురుదేవులు ఎప్పుడూ. నిజజాగ్రత్తలో అంటే సత్యంలో ఉండటమే. నీవు సత్యాని కన్న భిన్నంకాదు అని గుర్తించాలి. దానికి అడ్డు వచ్చేవి అన్నీ ఈ సృష్టిలోవే. సదసద్వివేకము, ఆత్మానాత్మ వివేకము అన్నీ ఒకటే. ఇది సత్యం అని లేదా ధ్యానం అని తెలిసికోవటానికి ఏంకావాలి? స్వామి మనకు ఇంతకాలం జరిగింది, ఇన్ని గంటలు అయింది అన్న స్పృహ అయినా లేకుండానే బోధామృతం

వర్షిస్తున్నప్పుడు మనను సభలో కూర్చోపెట్టేవారు. చివరకు స్వామి అనేవారు 'ఇన్ని గంటలు ఆకలిదప్పిక మరచి,దైహిక అసరాలనుకూడ మరచి, ఏవీ గుర్తురాకుండా ఇన్ని గంటలు ఇక్కడ కూర్చున్నావు. ఒక్కడవే అయితే కూర్చోగలవా? నీవు ఇంతకాలం భగవత్తత్త్వంలో ఓలలాడావు కనుక కూర్చున్నావు. అదే ధ్యానం. అదే సమాధి. అది నీ నిత్యకాలంలో జమ అవుతుంది' అని చెప్పేవారు.

గురుదేవుల చరణం, వారి అభయహస్తం, వారిదృష్టి వారిలో దేనిపైన మన దృష్టి నిలచినా చాలు. వారి దృష్టితో మాటిమాటికీ అటు ఇటూ తిరిగి చూసే మన దృష్టి కలవటమే ఏకాగ్రత. మన దృష్టే చంచలమైనది. భగవంతుడి దృష్టి ఎప్పుడూ ఏకాగ్రంగానే ఉంటుంది. ఆ స్వామిదృష్టితో దృష్టి కలిపితే, స్వామియు నీవును జగమును సర్వము శివమయమవుతుంది.

దృష్టిలో ఏకాగ్రత ఎందుకు? పూర్వం ఎవరో కౌశికుడు అనే అతను తపస్సు చేస్తుంటే పైనుండి కాకి రెట్ట వేసిందని పైకి దానివైపు చూశాడు. ఆ కాకి చచ్చి క్రిందపడింది, అతడు ఊరుకోక భిక్షకు బయలుదేరాడు. ఒక పతివ్రత ఇంటిముందు నిలబడి 'భవతీ భిక్షాందేహి' అని కేక పెట్టాడు. ఆ ఇల్లాలు పతిసేవలో ఉండటం వలన భిక్షతేవటం కొంచెం ఆలస్యం అయింది. ఏం నేనంటే ఇంత చులకనా అని ఆమెవైపు కళ్ళెర్ర చేసిచూశాడు. ఆ పతివ్రత నీవు కళ్ళెర్ర చేసి చూస్తే చచ్చిపోవటానికి నేనేమైనా కాకిని అనుకున్నావా అన్నది. అతడు వెంటనే ఆమెను శరణు వేడాడు. 'తల్లీ నీవు సామాన్యురాలవు కావు. నాకు మార్గం చూపించు' అని, ఏకాగ్రతతో పతిని సేవించినందువలన ఆమెకు ఆ శక్తి వచ్చింది.

తపస్సు ఎప్పుడూ ఇతరులకు మేలు చేయటంకోసమే అయి ఉండాలి కాని, మనలోని ఈర్ష్య అసూయలను, ఓర్వలేని తనాన్ని, అసహనాన్ని పెంచటానికికాదు. ఈర్ష్య, అసూయ, ఓర్వలేనితనం, అసహనం ఎక్కడ ఉంటే అక్కడ నాశనమే. అటువంటిదృష్టి ఉన్నందు వలననే మనం దహింప బడుతున్నాము. ఎవరి మీద ఈర్ష్య వచ్చినా, అసూయ కలిగినా అవన్నీ మన మనస్సులోనుండే వస్తాయి. సైన్స్‌పరంగా చూసినా, ఎవరిలో ఈర్ష్య, అసూయ, ఓర్వలేనితనం, అసహనం, క్రోధం, కోపం ఉంటాయో వాళ్ళ హార్ట్‌బీటు పెరుగుతుంది అంటే గుండె వేగంగా కొట్టుకుంటుంది.

- సశేషం

## శ్రీ బాబూజీ దివ్యవాణి

**ఇహం - పరం** శీర్షిక క్రింద ఆంధ్రప్రభలో వెలువడిన శ్రీ బాబూజీ మహరాజ్ వారి దివ్య సందేశములు.

### గీతా సందేశం

\- వసిష్ఠ

'గీతా' అనే శీర్షికలోనె ఉన్నది గీతా సందేశ సారాంశం. గీతను కేవలం పఠించినందువల్లా, వ్యాఖ్యానించినందువల్లా ప్రయోజనం ఏమంతగా ఉండబోదు. గీతా హృదయాన్ని అవగాహన చేసుకొని ఆచరణలో పెట్టడం అవసరం. ప్రతిదినమూ ఉదయంగాని, సాయంకాలంగాని భగవద్గీత ఒక అధ్యాయమో రెండధ్యాయాలో నిత్యమూ పారాయణ చేయడంతో తమపని తీరినట్లు సామాన్యంగా అత్యధిక సంఖ్యాకులు భావిస్తూ వుంటారు. ఆ పవిత్ర గ్రంథ స్పర్శ మాత్రముననే నీవు పవిత్రుడవు కాజాలవు. నీ హృదయానికి తగలాలి దాని స్పర్శ. ఆధ్యాత్మిక సాధకుడైనవాడు దానినిఊరక పఠించడమే కాక, పూర్తిగా అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించాలి.

గీతను నిత్యజీవితములో ఆచరణలో పెట్టడానికి ముఖ్యంగా కావలసిన దేమిటి? జీవితంలో త్యాగమును అభ్యసించాలని గీత ఉద్బోధిస్తున్నది. త్యాగమంటే యజ్ఞం, బలిదానం, నీకున్నదంతా సమర్పణ చెయ్యడం. వెంటనే ఇక్కడ ఒక సంశయం తలఎత్తుతుంది - 'దేనిని బలిగా సమర్పించాలి?' అని. ధనమునా, వస్తుసంపత్తినా, ప్రతిష్ఠనా, అధికార పదవినా,' - దేనిని త్యాగం చెయ్యాలి? ఈ పనులేవీకూడ త్యాగమని పిలువబడుటకెంతమాత్రం పనికిరావు.

'నేను,' 'నాది,' అనే భావాలను (అహంకార మమకారాలను) త్యాగం చెయ్యడానికి నీవు సిద్ధంకావలసి ఉంటుంది. ఈ అహంకార మమకారాలే మానవుని మాయలో కూలద్రోస్తున్నవి. గీతోపదేశానికి కారణభూతమైనవి కూడా ఈ అహంకార మమకారాలే. కురుక్షేత్ర యుద్ధంలో జయం సాధించడానికై కృష్ణ భగవానుని సారథిగా చేసుకొని బయలుదేరిన కృష్ణభక్తుడూ, వీరాధివీరుడూ అయిన అర్జునుని కైవసం చేసుకొన్నవి ఈ అహంకార మమకారములే.

ఉభయసేనల మధ్య నిలిచి శత్రు పక్షంలోని వారిని అవలోకించడం తోటే అతడు 'అహం' 'మమ' భావావేశమున విపరీతమగు మోహబంధంలో చిక్కుకొనిపోయాడు. అచట అతనికి కానవచ్చినదెవరు? గురువులు, తండ్రులు, తాతలు, మామలు, కుమారులు, మనుమలు, అంతా బంధు జాలమే! అతని కన్నులు అశ్రుపూరితములైనాయి. చేతులు వణికి పోయాయి. దైన్యం అతనిని

ఆవహించింది. నేనీయుద్ధం చేయలేనన్నాడు. విజయంగాని, రాజ్యంగాని, భోగాలుగాని తనకు అక్కరలేదన్నాడు. అవన్నీ వ్యర్థములన్నాడు. బంధువర్గమంతా నశించినపిమ్మట వీటిలో సుఖమేమున్న దన్నాడు. మోహబంధ మీరీతిగా అతనిని దుఃఖంపాలు గావించినందువల్లనే గీత మొదటి అధ్యాయానికి 'అర్జున విషాదయోగం' అనే పేరువచ్చింది. ఈ మోహం అతనిలోని అహంకారాన్ని రెచ్చగొట్టింది. ఇవి రెండూ తోబుట్టువులుగదా! అహంకారం అతనిని భగవానునికే ధర్మాధర్మములు ఉపన్యసింప ప్రేరేపించింది. కాని, భగవానుడు నిశ్చలుడై చిరునవ్వుతో దీనినంతనూ తిలకించాడు. అయితే, ఇదంతా కేవలం తన అజ్ఞానజనితమని అర్జునుడే మరల గ్రహించి, ఈ ఊబిలోనుండి తనను బయట పడవేయ వలసినదిగా కోరుతూ తనను శరణు వేడుకొనిన మీదటగాని, జీవనతత్త్వ సారమగు గీతాబోధ చేయుటకు భగవానుడు ముందుకు రాలేదు.

సంపూర్ణ శరణాగతి నొందినవాడై అర్జునుడు, 'కృష్ణా, ధర్మ సమ్మూఢచేతస్కుడనైనందువల్ల నాకేమీ తెలియడంలేదు, నేనేమి చేయదగియున్నదో నీవే నన్ను ఆదేశించు, ఆ ప్రకారం చేస్తాను, 'నీ శిష్యుడను నేను' అని ప్రార్థించాడు. ఈరీతిగా అతడు నేను, నాది అనే భావాన్ని (అహంకార మమకారములను) విడనాడుట వల్లనే గీతామృతమును స్వీకరించుటకు తగిన పాత్రము కాగలిగినాడు. గీతా పదమును తిరగవేసి చదివినప్పుడు త్యాగీ అవుతుంది. అర్జునునివలె మనముకూడా అహంకార మమకారములను విడనాడిన త్యాగులమైనప్పుడే మన హృదయాలు గీతామృతమును నింపుకొనే చక్కని పాత్రలుగారూపాంతరం చెందుతాయి.అహంకారపూర్ణ పరత్యాగమై ఇచట సమర్పించ వలసిన బలిదానం. దాని ద్వారముననే మనకు జ్ఞానోదయమవుతుంది. ఐహిక విషయబంధమును విడనాడి ఎవరు భగవత్పాదపద్మముల కడ ఆత్మ సమర్పణం చేసుకుంటారో వారిని సంసార సాగరమునుండి ఉద్ధరిస్తానని అభయమిచ్చినాడు భగవానుడు. గీత 18 వ అధ్యాయపు 66 వ శ్లోకం ఈ ఆత్మ సమర్పణావశ్యకతనే కదా బోధిస్తున్నది?

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహంత్వా సర్వ పాపేభ్యో మోక్ష యిష్యామి మా శుచః**

మోక్షమును పొందగల అధికారం ఒక్క అర్జునునికేగాదు, ఆత్మ సమర్పణభావమును పెంపొందించుకొనిన ప్రతి సాధకునికి అధికారమున్నది. కాళీగార్డెన్సు విజ్ఞానమందిరంలో శ్రీ బాబుఒకనాటి తన ప్రవచనంలో నిక్కమైన గీతాదృష్టి నలవరచుకోవలసినదిగా శిష్యులకు చేసిన హెచ్చరిక ఇదే.*

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి)

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

'నేను అలా ఆవిర్భవించి, తపస్సుకు వెడుతున్నాను. నా వెనుక మహా తేజోవంతుడు, అమిత బలవంతుడు అయిన ఒకాయన వస్తున్నట్లు గమనించాను. 'మీరెవరు?' అని ఆయనను అడిగాను. 'నేను హనుమానుడను. నీకు తోడుగా ఉండమని జగజ్జనని పంపింది' అని ఆయన చెప్పారు. ఆయనకు నమస్కరించి ముందుకు సాగాను. మిల మిల మెరిసే మేని ఛాయతో,సౌభాగ్యం ఉట్టి పడే సౌందర్యంతో, నాకెదురుగా ఒక పండు ముత్తైదువు చిరునవ్వులు చిందిస్తూ వచ్చింది. 'ఎవరవమ్మా నీవు?' అని అడిగాను. 'నీకు అమ్మనురా! జగజ్జననిని రా! ఇలా రా నాయనా!' అని తన ఒడిలోకి తీసికొని ఒళ్ళంతా నిమిరి, ముద్దులతో నింపివేసింది. నా చేత కామాక్షి పళ్ళు తినిపించి, జ్ఞాన క్షీరాలను ఇచ్చి, ఇలా అన్నది..



'నాయనా, నిన్ను నేను సర్వదా కంటికి రెప్పలాగా కాపాడుకుంటాను. నువ్వు దేశమంతటా సంచరించి తపస్సు చేసుకో. నీకు మారుతిని తోడుగా ఉంచుతున్నాను. ఆయనను నీవు తలుచుకుంటేచాలు. నదులను, పర్వతాలను, అడవులను అవలీలగా దాటించి, నీవు కోరిన చోటికి నిన్ను చేరుస్తాడు. ఎక్కడున్నా నిర్భయంగా సాధన చేసుకో. సర్వజీవకోటి సంక్షేమాన్ని, విశ్వశాంతిని, లోక కళ్యాణాన్ని నీ ధ్యేయంగా నిలుపుకొని నన్ను ధ్యానం చేసుకో. సదా నా ఆశీస్సులు నీపై వర్షిస్తూ ఉంటాయి. నీమాటే నా మాట అవుతుంది. నీ అడుగే నా అడుగు. నీ శ్వాసయే నా శ్వాస. నీ దృష్టియే నా దృష్టి అవుతుంది. పంచభూతాలు, సూర్య చంద్రాది సమస్త దేవతలు నీ స్వాధీనం లోనే ఉంటారు. నీ యశస్సు దిగంతాలు నిండుతుంది. సకల జీవకోటికి సేవ చేసుకో. నేను సంతోషిస్తాను. నాగేంద్రుడెప్పుడూ నీకు రక్షణగా నిలిచి శీతోష్ణములనుండి, ఇతర జీవులవలన నీకు కలిగే బాధలనుండి నిన్ను కాపాడుతాడు. తరించే మార్గాన్ని

నిస్సంకోచంగా, నిర్భయంగా అందరికి అందించు. నీ వలన ఎందరో తరించగలుగుతారు. నీ సేవ సార్థకమవుతుంది. నన్ను ఆనందింప జేసినవాడవవుతావు. ముందుకు సాగిపో. విజయోస్తు' అని అమ్మ నన్ను ఆశీర్వదించి పంపింది.

నా మాట, నా భావము, నా క్రియ అమ్మ ఆజ్ఞతోను, ఆశీస్సులతోను మాత్రమే జరుగుతాయి. కనుక నా సూచనలను మీరు విశ్వాసంతో, నిశ్చయంతో ఆచరించండి.

నేను అమ్మ ఆశీస్సులను అందుకొని ముందుకు సాగాను. దివ్య తేజస్సుతో ఒక మహర్షి, జగన్మాత దివ్యమూర్తితోను, వీర హనుమాను భద్రమూర్తితోను కూడిన దేవతార్చనను నాకు ప్రసాదించి, పూజించుకోమని చెప్పారు. అమ్మ, 'అది సదాశివుని ఆజ్ఞతోనే నీకు ఈయబడినది. దానిని భక్తి శ్రద్ధలతో నిత్యము పూజించుకో. అది నీకు, లోకానికి, ఎంతో మేలు చేస్తుంది' అని చెప్పింది అని ఆ దివ్యబాలుని రూపంలో కనిపించిన శ్రీబాబు సెలవిచ్చారు.''

ఇలా ఎందరెందరో భక్తులు శ్రీబాబు అవతార లీలలను గూర్చి ఎన్నో దివ్యములైన అనుభవములను పొందినట్లు తెలిపారు. శ్రీబాబు అవతార ఆవిర్భావాన్ని గూర్చిన భిన్న భిన్న కథనాలన్నీ సత్యమెలా అవుతాయని సందేహించ వలసిన పని లేదు. స్వప్న దర్శనాలను గూర్చి స్వామి స్వయంగా ఇలా చెప్పారు. "కలలన్నీ నిజం కావు. కాని స్వప్నంలో కలిగిన భగవద్దర్శనము, గురు దర్శనము మాత్రం సత్యమైన అనుభవాలుగా గుర్తించాలి గాని, కలయే గదా అని త్రోసి పుచ్చరాదు. అసత్యమైన ప్రపంచమును ప్రకాశింపచేసేది సత్యవస్తువైన పరమాత్మయేకదా!

ఈ గురువాక్యమునసరించి, స్వామి తమ ఆవిర్భావాన్ని గూర్చి స్వయంగా తెలిపినది ఎంత సత్యమో, నిజభక్తులు పొందిన ధ్యాన, స్వప్నానుభవములు కూడా అంత సత్యమే అని అంగీకరించక తప్పదు. ఇక ఆద్యంత రహితుడై, ఘటనాఘటన సమర్థుడై తన సృష్టిలోని అన్ని రూపాలు తానే ధరించిన భగవానుని విషయంలో ఆ యా భక్తులు తమ తమ స్వప్నాలలో దర్శించిన ఆవిర్భావ వివరాలు యధార్థమవటం ఆసంభవమేమీకాదు.

అన్నిటికన్న ముఖ్యమైన విషయం ఏమంటే, తాము జనన మరణ రహితులై, మానవునికి స్వప్నంలోనో, ప్రత్యక్షంగానో దర్శనమిచ్చి, "నీవు జనన మరణ రహితుడవు'' అనే ఆత్మజ్ఞానం ప్రసాదించ వచ్చిన వారు సద్గురువు. -సశేషం




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

"వత్సా!"కృష్ణుడు దగ్గరగా వచ్చి అశ్వత్థామ నుదుటిపైన చెయ్యి వేసి, "సుదర్శనం ఒక శక్తి నాయనా. ఆ శక్తి ప్రాప్తికి స్వామిత్వ భావన కాదు, సమర్పణ భావం ఉండాలి! ఎప్పుడు నువ్వు ఈ సత్యాన్ని గుర్తిస్తావో, ఆ క్షణంలో నీకు సుదర్శనానికి మించిన శక్తులెన్నో నీకు వశమవుతాయి."

అశ్వత్థామ ఏమీ మాట్లాడలేపోయాడు. కృష్ణుని వంటి గొప్ప వ్యక్తిత్వం ముందు తన అస్తిత్వం ఎంతో చిన్నదిగా అనిపించింది...

" ఏమీ సంకోచ పడకు ఆచార్యపుత్రా!" కృష్ణుడు సముదాయిస్తూ అన్నాడు, 'శక్తి ప్రాప్తికోసం చేసే ప్రయత్నం... దాని ఆరాధన లజ్జాస్పదమైనదేమీ కాదు! ఆ శక్తిని పొందటానికి చేసే ప్రయత్నాన్నిబట్టి ఆ వ్యక్తియొక్క శ్రేష్ఠత్వం లేక అధమత్వం నిర్ణయింపబడుతుంది... ఇప్పుడు చెప్పు వత్సా! సుదర్శనం లాంటి ప్రచండ శక్తిని స్వాధీనం చేసికోవటంలో నీ ఉద్దేశ్యం ఏమిటి?"

అశ్వత్థామ అప్రతిభుడైనాడు... సుదర్శన ప్రాప్త్యనంతరం మిమ్మల్ని హత్య చేయటమే నా ఉద్దేశ్యం అని చెప్పగలడా? కృష్ణుని స్థానంలో తాను వాసుదేవుడు కావాలనుకున్న ఆకాంక్ష కృష్ణుడికి తెలిసిపోతే?

సుదర్శన చక్రప్రాప్తి మాట అటుంచి ప్రాణరక్షణ చేసికొనే మార్గం వెతుక్కోవాల్సి ఉంటుంది... కృష్ణునివైపు చూడకుండానే అశ్వత్థామ వెనుదిరిగాడు.

"ఉద్ధవా!" అతీతంలోని పుటలలో ఎక్కడో ఒక మూల దాగిఉన్న అధ్యాయం ఈ రోజు అతని ముందు కనులు కట్టినట్లు కనపడేసరికి అతని అంతరాత్మ ఆక్రోశించింది. "కృష్ణుని ప్రాణహరణంకోసం నేను ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించి ఎంత చెడు తలపెట్టాను. కృష్ణుని ఔదార్యాన్ని తెలిసికోకుండా, నేను సుదర్శన చక్రం కైవసం చేసికోవటానికి నికృష్ట ప్రయత్నం చేసిన విషయం గుర్తుకి వచ్చింది. ఈ వేదనను నేను ఎలా మరవగలను?

నన్ను ఒక్కసారి కృష్ణుని వద్దకు తీసికొనివెళ్ళు ఉద్ధవా!... నేను కృష్ణుడు వేసిన ఆ ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలి.ఆయన చరణాలముందు మోకరిల్లి నేను తలపెట్టిన ఘోరకృత్యం గురించి చెప్పి నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసికోవాలి.

ఉద్ధవుని కళ్ళు చెమ్మగిల్లాయి.

"నాయనా అశ్వత్థామా!" ఉద్ధవుడు ఆప్యాయంగా అతని తల నిమురుతూ అన్నాడు, "పాప - పుణ్యములు ,కర్మ - అకర్మలు మొదలైన ఈ ద్వంద్వములన్నిటినుండి ముక్తుడవు కా! అశ్వత్థామా ఇక శరీరమూ లేదు, ఏ ఆత్మా లేదు. కుచ్ఛితమైన, నీచమైన కర్మలు ఆత్మను అంటకుండా నువ్వు జీవితాన్ని గడపాలన్నదే నీ నుండి కృష్ణుడు అపేక్షించేది. ఇదే నీ లక్ష్యంగా పెట్టుకొని నీ శేష జీవితాన్ని గడుపు."

" అలా కాదు ఉద్ధవా... అలా కాదు..." అశ్వత్థామ అన్నాడు ఏడుస్తూ, "శ్రీకృష్ణుని సమక్షంలో నిలబడి ఆయన ప్రశ్నకు సమాధానం చెప్పనంతవరకు నా వేదనకు శాంతి లభించదు..." " కృష్ణుని దర్శనం ఈ బ్రహాండంలోనే లభిస్తుంది. కృష్ణుడు తన కర్మదేహాన్ని త్యాగం చేశాడు..." అన్నాడు ఉద్ధవుడు శాంత స్వరంతో.

"అంటే?" అశ్వత్థామ ఒక్కసారిగా విహ్వలుడై "ఉద్ధవా! ఏమిటి మీరంటున్నది? త్వరగా చెప్పండి కృష్ణుడు ఎక్కడ ఉన్నాడో? అని అడిగాడు.

"కృష్ణుడు నీ దగ్గరే ఉన్నాడు - ఇక్కడ, అక్కడ, సర్వత్ర ఉన్నాడు. కృష్ణుడు ఇప్పుడు శరీరధారి కాడు. అశరీరి, పరతత్త్వం. కృష్ణుడు ఇప్పుడు పరమ తత్త్వం." ఉద్దవుడు కనులు మూసుకుని ఇలా అన్నాడు "ఒక మహాయుగం సమాప్తమైంది నాయనా!"

"కృష్ణుణ్ణి దేహధర్మం స్పృశిస్తుందా? ఒక్కసారిగా లేచినుంచున్నాడు అశ్వత్థామ. 'అశ్వత్థామ వ్యథాజ్వాలపైన కృష్ణునిస్నేహమనే చల్లటి అమృతధారలు పడనిదే మహాయుగం సమాప్తం కాదు. అంతవరకు కృష్ణుడు ఎక్కడికీ వెళ్ళలేడు..." అన్నాడు అశ్వత్థామ ఉద్ధవునితోతాను పడే వేదనను గుర్తుకుతెస్తూ. " నేను కృష్ణుణ్ణి వెతికి పట్టుకొంటాను ఉద్ధవా! కృష్ణుణ్ణి నేను వెతుకుతూనే ఉంటాను. నాకు కృష్ణుడు ఏ రోజు కనిపిస్తాడో ఆ రోజున..." ఉన్నట్టుండి అశ్వత్థామ వీపు దులుపుకుంటూ అడవిలోకి పరిగెత్తుకుపోయాడు...చివరగా అతడు మాట్లాడిన మాటలు గాలిలో ప్రతిధ్వనించి క్రమంగా క్షీణించి

నిశ్శబ్దంలో లయమయిపోయాయి.

"కళ్యాణమార్గంలో చేసే యాత్రలో ఉద్ధవుడు ఇప్పుడు ఏకాకి!. ఎవరైనా (కృష్ణుని)ఆదేశాన్ని పాటించి పుణ్యం పొందవచ్చును. కాని ఆత్మాన్వేషణ మార్గంలో ఒంటరిగానే పయనం చేయాలి. ఎవరూ ఇంకొకరి సుఖానికి కారణంకాదు - ఎవరూఇంకొకరి దుఃఖానికి కారణంకాదు! ఆత్మ, అతను చేసిన కర్మ - ఈ రెండూ పరస్పరం ముడిపడిఉన్నాయి..."

అశ్వత్థామ అడుగుల క్రిందపడి నలుగుతున్న ఎండుటాకుల శబ్దం కాదు కదా...

ఉద్ధవుడు చేతులు జోడించి దశ దిశలకు ప్రణామం చేశాడు. యాదవులను ప్రభాసక్షేత్రానికి తీసికొనిపోయేముందురోజు సంధ్యా సమయంలో స్వయంగా కృష్ణుడే కదా-ఈ మాటలు అన్నది... తాను మరచిన ఈ మాటలు ఈరోజు తిరిగి ఎలా వినిపిస్తున్నాయి?

ఉద్ధవుడు అశ్వత్థామకు మనశ్శాంతి కలగాలని మళ్ళీ ప్రార్థించాడు.

తన గంతవ్యానికి చేరువ అయినాడు... యమునా తీరాన స్థితమైఉన్న మధురను చూస్తుంటే గోపగృహిణి తేజస్వి అయిన బాలకుని తన ఒడిలో కూర్చోపెట్టుకున్నదా అన్నట్లు అనిపిస్తోంది... మధురను చూడగానే తన నడక వేగం తగ్గిపోయింది. కాళిందిలోని నీలవర్ణపు శీతల జలాలో దిగాడు. దిగినవాడు దిగినట్టే నిలబడిపోయాడు. సూర్యుడు పశ్చిమదిశకు దిగజారుతున్నాడు. సూర్యుడు అస్తమిత ఎర్రని కిరణాలలో కాళింది జలాలకు ఎరర్రంగ వేస్తున్నాడా అన్నట్లు ఉన్నాయి ఆ జలాలు.... కాళింది చుట్టూ నీరవంగా, నిర్జనంగా ఉంది. రేవును తాకుతున్న కెరటాలు చేసే ధ్వని, నీటిలో ముక్కులు పెట్టి పక్షులు చేసే చహ చహ శబ్దాలు తప్ప సర్వత్ర శాంతి అలముకొంది.

ఉద్ధవుడు మధురవైపు చూశాడు - మార్గమంతా గోవుల గిట్టల చిహ్నాలు, రథ చక్రాల గుర్తులతో పాటు వివిధ శకటాల గుర్తులు కనిపించాయి.

-సశేషం

## శ్రీశ్రీశ్రీ హనుమత్‌కాళీ వర ప్రసాద బాబు ఆవాస గురుకులం

(శ్రీకాళీగార్డెన్స్, నంబూరు ఆర్.ఎస్. గుంటూరు జిల్లా, ఆం.ప్ర)

**(ప్రభుత్వ గుర్తింపు పొందిన విద్యా సంస్థ)**

**ఆగండి!** **ఆలోచించండి!!**

విద్య అంటే విజ్ఞానము. అది అమ్మబడేది కాదు. కొనబడేది కాదు. అది అనుభవంతో కూడిన అధ్యాపకులు రూపొందించిన కార్యక్రమాల ద్వారా ఆర్జించేది. ఎల్.కెజి నుండి టెన్త్ క్లాస్ వరకు ఇంగ్లీషు మీడియంలో శిక్షణ.

ప్రత్యేకతలు :

- ప్రశాంత వాతావరణము ఆధ్యాత్మిక శిక్షణ
- యోగాసనాలు
- క్రమశిక్షణ, సత్ ప్రవర్తన
- అగ్రగామి టీచర్లచే బోధన
- రెసిడెన్షియల్ ట్యూటర్ల పర్యవేక్షణలో చదివించటం
- బాలబాలికలకు ప్రత్యేక హాస్టలు వసతి
- వీక్లీ టెస్ట్‌లు, డైలీ అస్సైన్‌మెంట్లు
- కంప్యూటర్ ఎడ్యుకేషన్
- డే స్కాలర్స్‌కి బస్సు సౌకర్యము
- సంస్కృత, హిందీ పరీక్షలకు శిక్షణ
- వైద్యసదుపాయం
- సెమి రెసిడెన్షియల్ సౌకర్యము కల్పించబడుతుంది.

గమనిక :

1. ఈ పాఠశాల యందు కనీసము 3సంవత్సరములు చదివి, గణనీయమైన మార్కులను సాధించిన పేదవిద్యార్థులకు స్కాలర్‌షిప్ సౌకర్యము కలదు.
2. స్కూలు 3-6-2009న తెరువబడును. వివరములకు కరెస్పాండెంట్‌గారిని స్వయంగాగాని, ఫోన్‌ద్వారాగాని సంప్రదించవచ్చు. లేదా వారికి వివరముల కొరకు వ్రాయండి.

**డి.జె. బాలకృష్ణలాల్**
కరెస్పాండెంట్
ఫోన్ నెం. 2594211 (ఆ), 2293229 (ఇ)

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,